# కవిజనరంజనము.

అడిదము సూరకవి

ప్రణీతము.

గంటి సూర్యనారాయణ శాస్త్రిగారు

సంపాదకుడు.

ప్రకాశకులు :
రామ్ జెయ్ అండు కంపెని,
13. తంబుచెట్టి వీథి,
మద్రాసు.

వెల రు. 1

# పీఠిక

శాపానుగ్రహసమర్థులును ప్రౌఢకవితాధురంధరులును శ్రీనాథాది మహాకవులలోఁ బరిగణింపఁబడిన యడిదము సూరకవి పదునెనిమిదవ శతాబ్దమునాఁటివాఁడు. ఆంధ్రకవిచరిత్రమునందుఁ బ్రబంధకవిత్వ ప్రకరణము సూరకవి రచించిన కవిజనరంజనము తోడనే ముగియవలసియున్నది. వారలచేఁ దిక్కన సోమయాజి తెలుఁగునఁ దన సమకాలిక కవులచే నీ సూరకవియు మిక్కిలి పొగడ్తగన్న మేటి.

క. రవి యెఱుఁగును భువితత్త్వము
భువిలోపల నుండు జనులఁ బోషించు సదా
శివుఁ డెఱుఁగు నాట్యతత్త్వము
కవితాతత్త్వంబు సూరకవియె తెలియున్

క. అంతా కవులము గామా
అంతింతో పద్యమైన నల్లఁగలేమా
దంతివి నీతో సమమా!
కాంతాసుమబాణ! సూరకవి నెఱజాణా!

ఇట్టి పద్యము లనేకము లున్నవి. ఇట్లు సమకాలికులేకాక తరువాతి వారుఁగూడఁ దమ తమ గ్రంథములలోని పూర్వకవిస్తుతులలో నీ సూరకవినిగూడ స్తుతించుచు వచ్చిరి. మాడుగుల సంస్థానాధీశ్వరుఁడైన శ్రీ [illegible]

గారు స్థానకవియగు మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి కృష్ణార్జునచరిత్రమునం గవిస్తుతులలో సూరకవి నిట్లు స్తుతిం

క. అడిదము వంశాంబుధి రా
డుడు పతియన ధరణి వెలసి యుర్వీశులచేఁ
గడు మన్ననగొని యొన్నం
బడు సూరకవీంద్రుఁ దలఁతుఁ బటుగుణ సాంద్రున్.

ఇట్టి పద్యములన్నియు సేకరించిచూడ, నాంధ్రక చరిత్రములో సూరకవి కొసంగవలసిన యున్నతస్థానమ గూర్చి యిరువదియవ శతాబ్దమునందలి మనము చర్చింప వలసిన యవసరము లేకుండఁ బూర్వకవులే యొక మునా నిర్ణయించిరని యూహింపవలసియున్నది. పిండిప్రో లు లక్ష్మణకవి లంకావిజయమునందు రచించిన యొక ములో సూరకవికి భీమకవి శ్రీనాథ రామలింగకవు సమానమైన స్థానమును గల్పించుచున్నాఁడు.

క. తెలియవినుఁ డాముకవ్య
దులు సూరకవి ప్రముఖ పృథు ప్రతిభాకం
తులు భీమ శ్రీనాథుల్
వెలయఁగ నాకరణిఁ దిట్టలే రూహమతిన్.

తిట్టుకవిత్వమునం దీ కవు లందఱికంటెఁ దాను డని లక్ష్మణకవి యభిప్రాయము. కాని "సూరక కంసాలి సుత్తెపెట్టు" అను పద్యపాదము లోకోక్తియై

దక్కిన చాటుపద్యములను గూడ సప్రయత్నముగ నత్యా
శువున క్షణకాలములోఁ గవినోటనుండి వెలువడియుండునని
శ్రవణమాత్రముచేతనే కవిత్వవేత్తలు గ్రహింపఁగలరు. ఆయా
పద్యములెల్ల వాని జీవిత చరిత్రాంశములను దెలిసికొనుటకు
మాత్రమే మన కుపయోగపడును గాని కవిత్వతత్త్వవిచార
మునకుఁ బనికిరావు. కావ్యకవితాప్రౌఢిమ చాటుకవిత్వమున
కలవనుట దుష్కరము. సూరకవిచాటుకవిత్వ మంతయు
నించుమించుగఁ దిట్టుకవిత్వమే. అందుచే నట్టి పద్యముల
యందలి భాష సామాన్యగ్రాంథికభాషగాక తఱుచుగ వాడు
కభాషయే యగుచున్నది.

ఆ-వె. మోటుముండకొడుకు మాట చెల్లిననాఁడు
నన్ను లక్ష్యపెట్టినాఁడు కాఁడు
తెలిసి యిపుడు నన్ను దీవించమంటాఁడు
పడ్డ చన్నులెత్త బ్రహ్మకశమె.

నిత్య వ్యవహార సంభాషణలయందుఁ గూడ సూరన తఱుచుగఁ బద్యములతోడనే ప్రసంగించుచుండువాఁడని వాడుక. కవిప్రయత్నపడ నవసరములేకయే వాని నోటఁబడిన సామాన్యవాక్యములు ఛందోబద్ధములై వెడలుచుండెను. ఒకానొక కాపుఁబడంతి తన యత్తవారియూరగు అదపాకకుఁ బోవుచు గ్రామాంతర మేగుచుండిన కవికంటఁబడినంత సూరకవి యామెను "అదపాకా? అత్తవారలానే పాపా!" అని

యుడిగెనఁట. ఇట్టి ప్రాసంగిక పద్యములు వందలకొలఁది పూ ప్రాంతమున మిక్కిలి ప్రచారములో నున్నవి. దూషణ భూషణ ప్రసంగాదులయందు సూరకవి చెప్పుచుండిన పద్యములు తెలియుచుగాఁ గందములే. ఈతని కందములు కవిత్వ వసంతమాకందములు. పూర్వము కవి చౌడప్పశతకకారుఁడు కందపద్య రచనయందుఁ దాను దిక్కనకంటె ఘనుఁడనని చెప్పుకొనినాఁడు:

క. క్రిందటి దినములలోపలఁ
గందములకు సోమయాజి ఘనుఁ డందురు నే
డందఱు నను ఘనుఁ డందురు
కందంబులఁ గుందవరపు కవిచౌడప్పా!

ఛంద స్సంబంధ నిబంధనలయందుఁ గందరచన క్లిష్టతరమగుటచేతఁ "గందము చెప్పినవాఁడు కవి, పందిని బొడిచినవాఁడు బంటు"నను సామెత వచ్చినది. పదునెనిమిదవ శతాబ్దమునందలి కవులలో సూరనవలెఁ గందము చెప్పఁగలిగిన కవి వేఱొకఁడు లేఁడు. ఇట్టికవిత్వమున సూరకవికంటె ఘనుఁడనని చెప్పుకొనిన పిండిప్రోలు లక్ష్మణకవి కాలక్రమము తప్పకుండ నలుగురు కవులపేరు లొక కందమునఁ బొందుపఱుజాలక తారుమారుచేసి పద్యము రచించుట కెంత ప్రయాసపడెనో పద్యరచనాతత్త్వజ్ఞు లీ క్రింది పద్యమువలన గ్రహింపఁగలరు.

క. తెలియావిను నాముకవ్యా
దులు సూరకవి ప్రముఖ ప్రజ్ఞ ప్రతిభావం
తులు భీమ శ్రీనాథుల్
వెలయఁగ నాకరణిఁ దిట్టలే యూహమతిన్.

సూరన యిట్టి రచనలయందు గొప్పనెఱజాణ. ఇట్టి కల్పనలు, నిట్టి భావములు, నెన్ని పేరులైనను గందములతో సౌచితి చెడకుండ సందముగాఁ గూర్పఁగల నేర్పరి.

క. సరివత్తురె గుణసంపద
నెఱకక మాపొణ్ణుపాటి వేంకటపతి కా
గ్గను చక్రవర్తులుఁ బదా
ర్గగు రాజులు మప్పద్దను నియోగివరుల్.

క. ధీరాగ్రణి శివరామ
క్ష్మారమణుం డేలు చెముడు శంబరపురమా?
పోరామా? రొంపిల్లా?
పారాదా? మంగరాజు పాలెము పట్టా?

క. బలవంతుఁడు బలహీనుఁడుఁ
బోలుతురు విధిశప్ప; నల్లపూసలు ముత్యాల్
తోలఁగుఁగద మగఁడువోయిన
వెలఁదుకకున్ బొణ్ణుపాటి వేంకటమంత్రీ!

క. కోశక పెరుగదు బచ్చలి
మేయక పాలీయ దావు మేదిని నెపుడే
నీయకరాదు సుకీర్తియు
వేయేలా పొణ్ణుపాటి వేంకటమంత్రీ!.

కందరచనయందేకాక తక్కిన వృత్తములు రచించుటం యందుం గూడ సూరన గొప్ప చతురుండని వాని కవిజన రంజన కావ్యమును బట్టి చెప్పవలసియున్నది. అందు ముఖ్యముగా శార్దూలవృత్తరచనలో సూరకవి రెండవ శ్రీనాథుండు. భాసురాలంకార పరిష్కృతములైన సుపదావరణముల కరంగి నతని శార్దూలవృత్తములు వాని కావ్యకథా వీథుల నతి గంభీరముగ సంచరించు చుండును.

శా. శయ్యాదంభమునన్ మురాంతకుండు, భూపాలైతవ స్ఫూర్తిచే
నయ్యార్యారమణుండుం దాల్తురు భుజంగాధీశులన్ నీయసా
హాయ్య ప్రస్ఫుట ధాటి కోర్వ కనుచో నష్టాస్యులా గెల్చు వా
రయ్యా గంధసమీర ! ప్రోవంగదవయ్యా యీ కురంగేక్షణన్.

పద్యరచనయందుం గవికిం గల సామర్థ్యము యతి ప్రాసలకూర్పు నేర్పునందే కొంత వెల్లడియగుచుండును. కవికిం గల రచనాచాతుర్యము పరీక్షించుటకే యతిప్రాసలు గీటురాళ్లు. కవిత్వతత్త్వమున నప్రతిమ ప్రతిభావంతుండైన సూరన యీరహస్య మెఱింగియే యతి ప్రాసలం గూర్చి యీ క్రింది సూత్రములను గల్పించినాండు:

సీ. యతియుక్త పంక్త్యాదు గతి నంటవలయు వ
త్సంబు ధేనువువెంటం దవిలినట్లు
నెట్టు మీందను గాలు పెట్టం గైదండ యం
దిచ్చినట్టులు ప్రాస మెనయవలయు.

ఉభయభాషలయందును గవితసెప్పు పోకడలఁ గూర్చి పెద్దన చెప్పిన [illegible] యను నుత్పలమాలికయందు సూరకవికి మక్కువ యెక్కువ. ఆ మాలికయందుఁ బెద్దన వివరించిన కవితాధర్మములను సూరన తన కవిజనరంజనము నందు మిక్కిలి పాటించెను. ఇంతియేకాక యట్టి మాలిక తానుఁగూడ రచించినాఁడు. కాని పెద్దనమాలికవలె సూరన మాలిక యాంధ్రదేశమున నంత వెల్లడి కానట్లు తోఁచు చున్నది. విమర్శకుల పరిశీలనకై యామాలిక నీ వ్యాసము నకుఁ జివరఁ జేర్చితిని. ఈ మాలిక సూరకవి విరచితమని మెకంజి [illegible] గ్రంథచింతామణియందు మాత్రము ప్రక టింపఁబడినది.

ఒక్క పెద్దన కవితారీతులే గాక శ్రీనాథాది మహా కవుల జాడ లనేకములు కవిజనరంజనమునఁ గానవచ్చుచున్నవి. శృంగార నైషధవసుచరిత్రాది మహాకావ్యములకుఁ దరువాత నాంధ్రవాఙ్మయములో నంతటి యున్నతస్థాన మలం కరింపఁదగిన దీ కవిజనరంజన మొక్కటియే. మఱియు నాఁటం గోలె నేఁటివరకు నెయ్యది పిల్లవసుచరిత్రమను విఖ్యాతి నొందుచున్నది. తన కావ్యపుత్రికలలోఁ గవిజనరంజనమునే సూరకవి యెక్కుడు ప్రేమించుచుండెను. రాజాస్థానముల యందును, నూతన గ్రంథరచనారంభములయందును ధ్యాన

శ్రీః

# కవిజనరంజనము

## ప్రథమాశ్వాసము

(శ్రీ రామాకుచమండల । సారతరపటీర పంకచర్చితవక్షా ।
క్రూరసురారిసితచ్ఛద। ధారాధర శేషకుధరధారుణి నిలయా॥)

కంఠీరవాఢ్యవిక్రమ
కుంఠునకును గుంభిదైత్యకోపాటోపా
కుంఠప్రతాపహరునకుఁ
గంఠేకాలునకుఁ బ్రమథగణపాలునకున్.

సమర్పణంబుగా నాయొనర్పంబూనిన కవిజనరంజనం
బను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

### అయోధ్యాపుర వర్ణనము

క. నూపురము భూపురంధ్రికిఁ
గాపురము జయేందిరకును గగనతలస్పృ
గ్గోపురము భాసిలు సయో
ధ్యాపుర మినవంశభూధవాధారంబై. 1

క. తన్నగరీతల్లజ శుం
భన్నవమణిఘృణివిభాసి పటుసాలశిఖా
భ్యున్నతి కోడుట సుమ్మా
పన్నగపతి యాశ్రయించె బలిసద్మంబున్.

తే. గీ. పటుతరానర్ఘ్య రత్నసంపదల కోడి
కొలువవచ్చెనొకో కోట జలధి యనఁగ
నతిగభీరజలస్థితి నతిశయిల్లి
పరిఘ చెన్నొందుఁ దత్పురవరమునందు. 3

క. సాలోన్నతి కోడి మహా
శైలములు దదంఘ్రిఁ గొలువఁ జనుదెంచెనొకో
నా లీలాగతి మదశుం
డాలంబు లగష్ఠ యనుకడలిఁ గ్రీడించున్. 4

క. వీటిపటుఘోటకనిరా
ఘాటత్వర కోడి పూరిఁ గఱచు హరిణముల్
మాటికిని దదాగోహకుఁ
డౌటం బవమానుఁడోడు టబ్బురమగునే. 5

క. మొగములు వేగలశేషుం
డగణిత వాగ్గరిమ కోడు నని పల్కఁగ నా
లుగుమొగములు గల యజుఁ డైన
యగునా వీరికన వీట నలరుదురు ద్విజుల్. 6

క. పుడమిం బొటిియలు దూరెడు
పిడుగులు, నడవ్రలనె డాఁగుబెబ్బులి, గుహలం
దడఁగెడు సింహము సరియే
వడిగలతనమునను రాచవారికి వీటన్. 7

ఆ. చదువు సాము గలిగి క్షత్త్రియుల్ సంపూర్ణ
విద్యులనఁగ వీట వినుతికెక్కి
సాధులను బరిచ్యుతాధులఁ జేయంగఁ
జాలకుందురె ప్రశంససేయ. 8

క. వెండిమలనికటభూముల
నుండి ధనార్జన మొనర్చి యొప్పారు కుబే
రుం డెంత యని హసింతురు
మెండగు ధనకోటి వీటి మేటి కిరాటుల్. 9

సీ. పారిజాతములు సంపాదించితిమి పుష్ప
మంజరుల్ గూర్చుట మాకు బరువె?
బలుతీగెమల్లె లుపార్జించితిమి చాలఁ
గుసుమముల్ బుటికఁగాఁ గూర్పలేమె?
కణజము ల్నిండ బంగారుతీఁగెలు గూర్పఁ
జాలమే మఱి ముత్తెసరులు గూర్ప?
స్థఁ బ్రయాగంబులార్జింప నార్జింపఁ
గా నోప మెట్లు గంగాజలంబు?
లంచు బహువిధచిత్రధాన్యములుగూర్చి
ధరణిసురపూజన విధావధాను లగుచు
వఱలుచుందురు రప్పూరివరమునందు
సుగుణమాణిక్యఖనులైన శూద్రజనులు. 10

సీ. లోకమోహనకళ ల్చేకొనియుండంగ
నతనుబాణము లౌటయబ్బురంబె!
మహనీయలీలల మానసం బలరింప
నంచబోద లనంగ ననువుపడదె!
గగనమధ్యమనోజ్ఞగతులు శోభిల్లుటఁ
జుక్కలంచు వచింప సూటిపడదె!
వలపులుగొలుపు చెల్వములు రాజిల్లుటఁ
బుష్పమంజరులని పోల్పఁదగదె!
వీరి నన నూరువిలసనవిజితరంభ
లంచితేక్షణావధీరితహరిణ లగుచు
నచ్చరల మీఱఁజాలు నొయ్యారములను
వెలవెలందుక లుందు రస్వోటియందు. 11

ఉ. మాముఖనేత్రబాహుకుచమంజిమలిట్టివియంచుఁ బ్రేమతో
గాముకకోటికిం దెలుపుకైవడిఁ దమ్ములు నల్లగల్వలుం
గోమలపుష్పదామములుగుచ్ఛము లంగటఁ బెట్టియమ్ముదు
ర్వేమఱుఁ బుష్పలావికలు వీటను నర్మవచఃప్రవీణతన్. 12

చ. పురనికటాంచితోపవన పుష్పితసాలములం గదల్చుచు,
న్సరసులఁ దేలుచు, న్సుమరజఃపటలంబులఁ జల్లులాడుచు,
న్సురుచిరకుంజపుంజములఁ జొచ్చినటించుచుమందగాములై
కరులవలెం జరించుఁ జలిగాడ్పులుషట్పదశృంఖలల్దగన్. 13

క. వలపుల పాణింధమములు
మలయానిలముల విహారమందిరములు పూ
విలుతుని యాయుధశాలలు
చెలువల జన్మస్థలము లచటి పూఁదోఁటల్. 14

గీ. అతులదరచక్రమీనరేఖాంకము లయి
యూర్మికాకంకణద్యుతి నొప్పుమీఱి
చారుపద్మాకరమ్ముల చందమునను
రాజిలుచునుండుఁ బద్మాకరములు వీట. 15

చ. అనుపమహైమకుడ్యఘటితాంచదనంతమణిప్రభాళిచే
ననయముఁదత్పురీవరమహాగృహముల్ రెయిదోఁపకుండగా
నొనరుచుటంజుమీ గృహము లొప్పె నిశాంతసమాహ్వయంబులన్
వినుతి యొనర్పఁగాఁదరమె వీటనుగల్గిన రత్నసంపదల్. 16

మ. అమరద్వీపవతీపయో విహారణప్రాంచత్సురస్త్రీల, వ
జ్రమయాభ్రంకషమాంటపాగ్రములనిచ్చల్ గ్రీడఁగావించుత
ద్రమణీవారము వేఱ నేఱుపఱుప న్నాదంచుఁగా దివ్యరా
జముఖీపాళికిఁదమ్మిచూలి యని మేషత్వంబుఁగావించుటల్.

మ. అతులోత్సాహములుప్పతిల్ల నికటోద్యానంబులంబొల్చు కే
కితతు ల్వీటను జిత్రనర్తనకలాకేలి న్విజృంభించు భ
వ్యతరాభ్రంకషరత్నసౌధపటలీ వాతాయనవ్రాత నిర్గత
కాలాగురుధూపధూమ్యలు మొయిల్గా నెంచి యెల్లప్పుడున్.

క. అనుపమతత్పురనారీ
జనులకు నచ్చరల కంగసౌందర్యము సం
గనుపడ వెక్కువ తక్కువ
కనురెప్పలయందకాని గణుతింపంగన్. 19

సీ. పద్మాకరముగాట, భవనరాజంబులు
విష్ణుపదం బంటి వినుతికెక్క
రత్నాకరంబౌట, రమణీయవప్రంబు
గగనస్రవంతితోఁ గలసి మెలసె
సుమనోభిరామత శోభిల్లుటను, దోఁట
లతులాప్సరస్సమన్వితము లయ్యె
రాజవతంసులై రంజిల్లుటను, నృపు
లమలదుర్గాధిపత్యమున మనిరి
భోగులకు నాశ్రయంబయి పొలుచుకతన
సన్నుతికి నెక్కె నది బలిసద్మమనఁగ
నిత్యకల్యాణలక్ష్మిచే నెగడుకతన
నాపురం బొప్పు విబుధాలయం బనంగ. 20

గీ. ధామములు తత్పురమున ముక్తామయములు
నిత్యకల్యాణసంప దన్వితులు విశులు
సతు లచటఁ గాంతమానసహితచరితలు
మంజులాస్యలు పురిఁ గల్గు లంజెలౌర. 21

సీ. బహుభాషణత్వంబు పటుశాస్త్ర
సంవాదచుంచువిద్వజ్జనస్తోమమందె,
క్రూరభావం బత్యుదారవిలాసవ
చ్చంద్రాననాకటాక్షములయందె,
చంచలభావంబు సముదగ్రభద్రదం
తావళరాజిహస్తములయందె,
వక్రభావంబు దుర్వారవిక్రమసము
ద్భటభటాధిజ్యచాపములయందె,
కాని పురమున జనులందుఁ గానఁబడ ద
నంగ నెంతయు నప్పట్టణము వెలుఁగు
హీరమణిమయసౌధాగ్రహేమకలశ
భ్రాజితస్వర్ణదీస్వర్ణపద్మ మగుచు. 22

క. అలజడిగలారు కలుషము
గలారు నిష్పచ్ఛరంబుగలవారు ప్రజల్
గలవా రనభిజ్ఞత్వము
గలారు పురి నెందు లేరు గణుతింపంగన్. 23

హరిశ్చంద్రవర్ణనము

క. ఏతాదృశపురమణికిని
నేత యితం డనుచుఁ బొగడ నెగడి నిజభుజా
శాతాసిగుప్త సకలో
ర్వీతలుఁడై యొప్పె శ్రీ హరిశ్చంద్రుఁ డిలన్. 24

సీ. తన పృథుకీర్తి ముక్తాచ్ఛత్రమునకు
స్వర్ణధరంబు కనకదండంబు గాఁగఁ
దన ప్రతాపసమగ్రదావాగ్నిశిఖకువ్యో
మంబు తదగ్రధూమంబు గాఁగఁ
దన నిరర్గళదానధారాంబులహరికిఁ
గైలాసశిఖరి సైకతముగాఁగఁ
దన కటాక్షస్యంది ఘనకృపారసవృష్టి
కఖిలార్థికోటి సస్యంబుగాఁగఁ
మహిని జెలువొందె మత్తారిమండలేశ
మకుటమణిగణశాణాయమాన చరణ
నఖరపాళి నిజాశ్రిత నళినహేళి
చారుకీర్తి హరిశ్చంద్రచక్రవర్తి. 25

క. లోకాలోకమహీధర
మే కోట, కులాచలములు కృతకాద్రులు, కే
ళాకూళులు జలరాసులు
శ్రీకరధృతి సాంద్రుఁడౌ హరిశ్చంద్రునకున్. 26

చ. అనిమిషశంకరాలయము లౌట మదోసమటంచు నెంచియో
తనఘనశౌర్యకీర్తుల విధంబున నుంట నో కాక హేమశా
ప్యనగము లర్థిసాత్కృతములై తగఁదున్కలు చేసి పంచఁడే
జనవరమౌళిమై తగు త్రిశంకుతనూజుఁడు దానవైదుషిన్.

క. చాయతరతత్త్వతాపము
హేయాళంబుగ హసించు హేళిం గెలిం
చేరు సదా హీరమణి
స్థిరమణిం దద్విశుద్ధ కీర్తిజ్యోత్స్నల్. 28

గీ. హంససదృశవృత్తి నలరి స్వర్ణాగము
మాడ్కి దనరి యజరమాశిని బోలి
తనప్రతాపశోభ తనకీర్తి రుచి యొప్పఁ
బొలుచు నా త్రిశంకుభూపసుతుఁడు. 29

గీ. ఆతతాయులు గనఁనాతతాయులుగా నొ
నర్చి వసుమతీజనముల నెల్ల
ధర్మ మెడలకుండ ధాత్రిఁ బాలించుచు
నద్భుతంబుగాదె యతని చరిత. 30

గీ. దివి నవగ్రహాయుతమయి తేజరిలుట
యుచితమంద్రడు హరిశ్చంద్రుఁ డుర్వియేల
భువి నవగ్రహాయుతమయి పొలుపుమీఱె
నద్భుతంబౌను గద తన్మహాత్త్వ మరయ. 31

క. నీతిసమగ్రుండయ్యు న
నీతిం బాలించె ధారుణీతలము నిజ
ఖ్యాతి చరిత్రము చిత్రం
బై తనరఁ ద్రిశంకు నరవరాత్మజుఁ డెలమిన్. 32

గీ. భీమశాంతాది నృపగుణబృందములను
నాతఁడ యధృష్యుఁ డభిగమ్యుఁ డౌచును౯
ననుచరాళికి సరఘాసమగ్రమధుర
సములచే మధుకోశము చందమునను. 33

గీ. నాలుగయిదాఱు నెమ్మోము లోలిఁ దాల్చి
ధాతృహరబాహులేయులు దద్గుణములు
సకలముగ సన్నుతింపంగఁ జాలకున్నఁ
జెఱవయొకిమోఁడు వేయిమోములు ధరించె. 34

ఉ. ఆపద లొందకుండ, రుజ లందకయుండ, మనుష్యకోటికిం
బాపము చెందకుండ, నొకపట్లను లేములు సోఁకకుండఁగా
నేపటిపోవ శాత్రవము లేలెఁ ద్రిశంకుజుఁ డానవద్వయ
ద్వీపము లిద్ధకీర్తి రుచిదిగ్విసరంబు సమాక్రమింపఁగన్. 35

విజయాస్పదపురవర్ణనము

వ. ఇట్లు మహీపాలనంబు సేయుచుండ.

గీ. ఇందిరాసుందరీకేళిమందిరంబు
భూవధూటికి మాణిక్యభూషణంబు
సకలసౌభాగ్యరాశికి జననసీమ
పొలుచు విజయాస్పదంబను పురవరంబు. 36

క. సలలితరంభారామా
వళు లగణితబుధు లనంతవాహినులు సము

జ్వాలహారులును సురమణులును
గలుగఁ బురము దివిజపురిఁ బెగడు టబ్బురమే. 37

క. లలి సలుపుగోమ్ములను స
త్కలి సద్ద్విజరాజ సంగతిఁ దగి సువర్ణో
జ్జ్వలమై సుమనోభినుతిం
దలరి పురముకోటతోఁట తనసు ఘనశ్రీన్. 38

సీ. ఏమహీతలనేత యాశ్రితసంత తా
శ్రితదయాభుత్వ మాత్రమేడితంబు
ఎవ్వాని రూపంబు వృషపవిలాసాంబుజ
లోచనామణుల కాసేచనకము
ఎవ్వాని గుణాలతాజృంభణంబునకును
ఘనతరన్యాయమార్గం బుపఘ్న
మే మహాభాగుసమిద్ధతీవ్రప్రదా
నైకహస్తము వార్ధికూంకుదంబు
అతఁడు జయరమాగోహణాయితవిశాల
భుజగుణాఘాతకిణుఁడు దత్పురవరంబు
పాలనముసేయు భూజనుల్ ప్రస్తుతింపఁ
గీర్తిశాలి యుశీనరక్షితిపమాళి. 39

గీ. కలశవారాశియందును గల్పవల్లి
మాణిక్యనాకరమునయందు మణిశిలాక

వైఖరిని నా నృపాలకవరునియందుఁ
జంద్రమతి యనుకన్యక జననమొందె. 40

చంద్రమతీ వర్ణనము

గీ. ధీరసౌందర్యమానసము తేజనంబు
నతులవాంఛాలతా వసంతాగమంబు
శంబరరిపుప్రతాపాగ్ని సామిధేని
జవ్వనం బంకురించె నాచంద్రముఖికి. 41

క. చానకు బాల్యముతోనే
నానాటికి సన్నగిల్లె నడుము కుచశ్రీ
తోన విరివియయి పొదలెను
నాననెఱులతోనె నిగిడె నవభోగేచ్ఛల్. 42

సీ. విరులునఖమ్ములు, వ్రేళ్లు పెసరగాయ,
లమగు లబ్జంబులు, మడమలు వట
ఫలములు, మలులు ప్రపదములు, దొనలుజంఘ,
లనంట్లు దొడలు, జఘన మిల, సుళి
బొడ్డు, గౌ దివి భంగములు వళు లా
రహి, గిరులు చన్ను, లిగుళ్లు కరములు, భుజ
ములు లత, ల్వీఁపు కదళికాదళ, మఱుత
శంఖంబు, తాటిగింజ చిబుక, మధ

రంబు పవడము, ముత్తెము ద్విజము, లద్ద
ములు కపోలములు, తిలము ముక్కు, చెవులు
శ్రీ ల్గొప్ప నేత్రములు• బొమ ల్సింగిణు, లర
నెలనుదురు మోము శశి కురు లళులు సతికి. 43

గీ. వనిత నెమ్మేనఁ బొడము లావణ్యరసము
నకును సుడియయ్యె గంభీరనాభి, తరఁగ
లయ్యెఁ ద్రివళులు, శైవలంబయ్యె నారు,
లేనగువు తేట కమనీయ ఫేనమయ్యె. 44

గీ. కలికిచూపులు దనసాయకములకంటె
వాఁడులై లోకవిజయధూర్వహము లౌట
నేమిపని వీనిఁ దాల్పంగ నింక ననుచుఁ
గానపా ల్చైసె దనయంబకముల మరుఁడు. 45

గీ. అరుణరుచిఁ బొల్చు నెలనాగ యంఘ్రియుగము
లీలఁ బంకరుహశ్రీల నేలలేదె
పద్మలోచనజంఘలు బత్తళికలఁ
జెలఁగి ప్రదరాన్వితములు గాఁ జేయలేవె. 46

చ. వనితవిలాసభాగవయవంబులకుం బరికించి చూడఁగా
నెన మఱిలేవు వానికవియే యెనయంచు మదిం దలంచి కా
యనుపమ తన్మనోజ్ఞకరభాకృతిగా నొనరించె నూరువు
ల్వనజదళాయతేక్షణకు వారిజసంభవు నేరుపెట్టిదో? 47

క. చెలియఱుత ముత్తెపుసరు
త్తెలివ్రాలని లోఁతు పొక్కిలి కలుఁగు నలన
న్వ్యాలలి తదపేక్షఁజను చె
ములచాలన మొఱఁగుటఁగాదు మగువకు నలమున్. 48

చ. మృగమదపంకిలస్తనమహీధరభూములఁ గ్రీడ సల్పఁగా
నగుతృషనాభికాసరసియందునుదూఁకొనుకంతునస్త్రఘులం
దగులు కురంగనాభముపథంబున రేఖగఁదోఁచెనాఁగఁజె
న్నగుమెఱుఁగారుసారసదళాయతనేత్రకు నేత్రపర్వమై.

చ. చెలియనవయోనులబ్ధయగు నిబ్బెపు గుబ్బలకబ్బె ...లే
ముల డిగనూకఁగా నవి సముత్కటభీతిని ...
స్థలిదనుఁజేరనీయక వెసం దఱుమ న్మతి పోవలేక ని
ర్మలరుచి నొప్పువాని నవమన్మథమైనసిరుల చెలించెనికన్.

క. కులశైలము లనరాదే
యిల నంబర మొరసియుండఁ బృథుతరకటకం
బు లనఁగరాదె పయోధర
ములు నాభాసిల్లియుండ ముదితకుచంబుల్. 51

క. కొమచనుపూచెండు లొగిన్
స్వమృదుతఁ గెమ్మోవి కెంపున కొసంగి తదీ
యమగు కఠినతఁ గొనియెఁ గా
క మహిని విరిబంతులకును గఠినత గలదే? 52

గీ. చన్నుగొండల క్రేవల సంభవించు
బాహులతలజనించిన పల్లవములు
పడఁతి కెంగేలు, తత్కర పల్లవముల
జననమొందినకళికలు సకియగోళ్లు. 53

గీ. శరధి శంఖంబు సతిగళస్ఫురణ కోడి
భరితదరవృత్తిఁ దనదైన శరణము చొరఁ
గమలపుట్టింటిచెలిగానఁ గనుముదమున
జడియకుమటంచుఁ జేపట్టెఁ జక్రపాణి. 54

గీ. అతివమోముసుధానిధియనుచునుండ
నధర మమృతంబుగురియుట యబ్బురంబె
తరుణికుచమండలము సువృత్తత వహించి
కర్కశత్వంబు గనుట యొక్కటియ యరుదు. 55

చ. చెలువమునెల్లఁ బ్రోవుగను జేసి ప్రవీణత నంబుజంబుల
న్నలువ సృజింపరే లవికనద్ద్యుతిహీనములౌటఁ గ్రమ్మఱం
గలువలఁజేసిఁ జేసినఁ బగల్ రుచిహీనముఁ డతండు నాఁటఁగా
కలికిమొగంబు రేవగలుకాంతిఁ దనర్పఁగఁ జేసె నిమ్మహిన్.

గీ. విద్రుమస్ఫూర్తిఁ దులకించు వెలఁదిమోవి
పల్లవస్ఫూర్తిఁ గల్పించెఁ బద్మజన్ముఁ
డఖిలలోకాద్భుతస్థితి నతిశయిల్లు
నింద్రజాలంబు గావించె నేమొ చూడ?. 57

క. తమ్ములకన్నను గన్నులు
తొమ్మిదిగుణములను హెచ్చు తొయ్యలికంచుం
బమ్మ దదక్షియుగోపాం
తమ్మున వ్రాసిన నవాంకతం దెలిపెఁ జెవుల్. 58

ఉ. మేలిపసిండిచాయయును మెచ్చులుగుల్కు మనోజ్ఞవాసనల్
చాలఁగఁ గల్గినందునను సంపెఁగపూ వొకవేళఁ బోల్చినం
బోలుపవచ్చుఁ గాకఁ గవిపుంగవు లేమి దలంచి పోల్చిరో
పోలికమాత్రగాక నువుపువ్వు వధూమణినాస సాటియే?

గీ. ముఖజలావణ్యరసపూరమున జనించు
జలచరంబులు గాఁబోలు జలజగంధి
కలికినిడువాలు గన్నులు గాని నాడు
తద్దఁ జపలతఁ గాంచునే తలఁచిచూడ. 60

చ. ఇరులు గుహాశ్రయంబు గని యెస్జల దాఘము లెల్ల ధారుణీ
ధరమున కేగె షట్పదవితానము కంజవనంబుఁ జొచ్చె సుం
దరహరిసీలజాలము తృణంబు గ్రసించె దదీయనైల్యభా
సురుకచమంజిమంబునకు నోడి సుమీ పరికించిచూడఁగన్.

ఉ. కన్నుల చంచలత్వమును, గబ్బిచనుంగవ కర్కశత్వము
న్నెన్నడమాంద్యముం, గురుల నెక్కొనువక్రత, కౌనుకా
ర్శ్యము,
న్నున్నతి కెక్కెనా నచల సంపదఁ బోఁటి కటిం ధరించుట
న్వన్నియ కెక్కవే యవగుణంబులు మిక్కిలి కల్మి యున్నడన్.

గీ. గంధగజరాజగామినికిఁ గనదుదార
హారమణిశర్కరిలకుచాహార్యవిహార
ణమున శ్రమమందఁ డయ్యెఁ గందర్పకుంభ
భవ్యనిశ్వాసపవనసంప్రాప్తికతన. 63

సీ. భూభృద్వరిమఁ గన్న పొలఁతుకచనుదోయి
యరిజయోన్నతిఁ గాంచు టబ్బురంబె!
కరికరాకృతిఁ గాంచు కలకంఠియూరువు
లనఁటికంబముల పెంపడఁచు టరుదె!
చంద్రబింబముఁ బోలు జలజాస్య నెమ్మొగం
బంబుజంబుల గర్వ మడఁచు టరుదె!
చక్రవర్తులలీల సంగ్రహించుపిఱుందు
ద్వీపవిజయశక్తిఁ దివురుటరుదె!
యలరుదీగియతో నుద్దియయినయట్టి
కొమ్మ నెమ్మేను వలపులు గొలుపు టరుదె!
విద్రుమస్ఫూర్తిఁ దులకించు వెలఁదిమోవి
కిసలయమనోజ్ఞరుచిఁ దిలకించు టరుదె! 64

గీ. పరిమళము లేక యుంట బంగరుసలాక
కలికి నెమ్మేనితో నుద్ది గాక పోయెఁ
జంపకంబు శిరీషప్రసవమృదుత్వ
గౌరవము లేమి మాదిరిగాక పోయె. 65

సీ. మేను మించులఁ జేసి వాని చాంచల్యంబు
వాలుఁగన్నులయందుఁ గీలుకొలిపి,
శశి నెమ్మొగ మొనర్చి చంద్రునందలి కప్పు
కుటిలాలకములందుఁ గుదురుపఱిచి,
కెంపు వాతెఱఁ జేసి కెంపుకాఠిన్యంబు
బటువుగుబ్బలయందుఁ బాదుకొలిపి,
విరులు గోళ్లొనరించి విరులసౌరభ్యంబు
నిట్టూర్పుగాడ్పుల మట్టుపఱిచి,
నలువ గావింపఁబోలు నీ చెలువ నార!
యనఁగఁ జెలువొందె నాచాన హంసయాన
యమృతపుంబావి యఱిదియందములకీవి
యాణిముత్తెమ్ము వలరాజునలరుటమ్ము. 66

వ. ఏతాదృశశ్లాఘాలంఘనజాంఘికసౌంద
ర్యాతిశయంబునం బ్రవర్తిల్లుచు;

క. వనజాక్షి హరిశ్చంద్రుని
కనదాకృతిరేఖ చిత్రకారులవలనం
గనియును, దచ్చరితంబును
వినియు, నతఁడ తనకుఁ దగినవిభుఁడని తలఁచెన్. 67

క. జనపాలకుఁడౌశీనరి
కనదాకృతిరేఖ చిత్రకారులవలనం

గనియును దత్కౌశల్యము
వినియు నదియ తనకుఁ దగినవెలఁదని తలఁచెన్. 68

మాలిని. తరుణశశివతంసా, తాపసాంభోజహంసా,
కరిదనుజవిదారా, కాశికాంతర్విహారా,
దురితహరణశీలా, దోర్విభాసిత్రిశూలా,
సరసగుణనికాయా, శైలకన్యాసహాయా! 69

క. సంయుగ్జితోగ్రదనుజ శు
భంయుగుణ ధరానిలశిఖిభానుశశిసభః
కంయజమానమయాత్మక
సంయమిజనవినుతచరణ! సర్పాభరణా! 70

గ ద్య.

ఇది శ్రీ మ ద శే ష మ నీ షి హృ ద యం గ మమృదు
పదనీరంధ్ర శుద్ధాంధ్రరామాయణ ఘటనా వైదుషీ
ధురంధ రాడిదము బాలభాస్కర కవితనూభవ సరస
కవిత్వవైభవ సౌజన్యనిధాన సూరయాభిధాన
ప్రణీతం బయిన కవిజనరంజనం బను మహా
ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

# కవిజనరంజనము

—:o:—

## ద్వితీయాశ్వాసము



శ్రీగిరిసుతాకుచోపరి
భాగమృగీమదవిభాసిబాహ్వాంతర, స
ద్యోగిధ్యేయపదాంబుజ,
భోగివలయ, రామచంద్రపురవరనిలయా! 1

వ. అవధరింపుము.

చ. వలపులకున్ని దాన, మలివారముగోరనికోర్కి జాతికిం
దలఁపనికీడు, పాంథసముదాయముపాలిటి వేఁకువిత్తు, కో
కిలములనోముపంట, స్మరకేవలశౌర్యహుతాశధాయ్య, రా
చిలుకలభాగధేయ మిలఁ జెన్నలరారె వసంత మంతటన్.

### వసంతకాలవర్ణనము

సీ. తరుణపల్లవలతాంతములతోఁ గూడనె
వలరాజుశౌర్యకీర్తులు వెలిఁగె,
నంచితసుమమరందాసారములతోన
విరహిణీబాష్పాంబువృష్టి గురిసెఁ,
గమనీయలతికాప్రకాండంబుతోడనె
శుకపికమధుకరోత్సుకత నిగిడె,

మలయానిలాంకూరములతోఁన కాముక
సమితివాంఛా కందళములు ప్రబలె,
భవ్యనవ్యప్రభాపరంపరలతోఁన
పరిమళంబులు దట్టమై పర్వె దిశల
సకలఋతుసార్వభౌమ వసంతఋతువు
త్రిభువనీమోహనం బయి తేజరిల్లె. 3

సీ. చిగురాకు టెఱ్ఱసంజజిగికిఁ బాండుర
కోరకములు భాసురతారకములు గాఁగఁ,
బ్రసవరసాసారపటిమంబునకు రాలు
కుసుమము ల్వడగండ్లగుంపు గాఁగఁ,
బ్రవహించుమధునిర్ఝరములకుఁబుప్పొళ్లు
నెఱితిప్ప లిసుకదిన్నియలు గాఁగఁ,
మంజుతరనికుంజ కుంజరంబులకు రో
లంబముల్ శృంఖలా లతలు గాఁగఁ.
బ్రసవకిసలయఫలరసరసికమధుక
రపికశుకనికరారవాక్రాంతదశది
గంతరాళము దనరె వసంతకాల
మఖిలభూజనరంజనం బగుచు నంత. 4

సీ. మావులు నెత్తావిదీవులై తనరారెఁ
దమ్ములఁ బువ్వుగుచ్ఛమ్ము లమరె;

దాఁకలఁ బూదేనెవాఁకలు ప్రవహించె
నిప్పులఁ బుప్పొళ్లతిప్ప లమరెఁ;
గోరకంబుల సిందువారకంబులు పొల్చె
బూవులఁదనరారె మోవులెల్లఁ;
గలికావళులచేఁ గదళికాతరు లొప్పె
మొగడలఁ దనరారెఁ బొగడ లెల్ల
బాగముల నవ్యకుసుమపరాగ మెసఁగె
నిమ్మలందును లేఁతపూరెమ్మ లమరె
ననలఁ బెనఁగొనెఁ జిన్నిగుంపెనలగుంపు
లభినవంబగు నా వసంతాగమమున. 5

క. చిలుకల చదువులబడులయి
యలులకుఁబానీయశాల లయి కోకిలమం
డలముల కామెత లయి వల
పులకు నిదానంబు లగుచుఁ బొలిచెం దరువుల్. 6

సీ. మధుభూపసైనికమండలి లాలుజెం
డా లనఁ దలిరాకుడాలు నిగిడె
లతికావధూజనాలంకృత హారనీల
సరములు నాఁదగె షట్పదములు
మలయాగతానిలమత్తేభ కరధుత
రజమునాఁ బుప్పొడి రాలెఁ దరుల

భువనత్రయజిగీషు పుష్పేషుచాపటం
కృతియనఁ బికనాదమెగసె దిశల
మహిత వనరమా ఝల్లరీమార్తికంబు
లనఁగఁ బాంశుర నవకోరకాళి దనరె
సమిత దోహద ధూపధూమ్యాంబువాహ
వృష్టి యనఁగను మకరందవృష్టి గురిసె. 7

సీ. పథికవియోగాగ్ని పాణింధమంబులు
ప్రాసహామోదధురంధరములు
గురుసరశ్శీకరకుక్షింభరులు లతి
కాబాలికాఢోలికాకలనలు
చైత్రభూమికళత్రచామరచలనము
లామ్రముకసౌభాగ్యకందళములు
పటుఘర్మజలకణపశ్యతోహరములు
మందగామిత్వసంపద్గజములు
ఫుల్లకాననమల్లికావల్లికామ
తల్లికావేల్లితనికుంజతతులఁ దాఁకి
వలపు మెలపునఁ గొలుపుచుఁ బొలసె నపుడు
గంధగిరిగంధవాహస్తనంధయములు. 8

గీ. ధీరమలయసమీర కిశోరకములు
సురభిళమనోజ్ఞ వనపరంపరలయందు
నలరుదీవియతూఁగుటుయ్యేలల నూఁగెఁ
దేఁటిఝుంకారములె జోలపాటలుగను. 9

గీ. అరుణపల్లవరుచి తెల్పె నపరసంధ్యఁ
జూపెఁ దిమిరంబు దోహదధూపధూమ్య
పాండుకోరకతతి యుడుప్రభల నించె
దాన మరుశౌర్యవహ్ని యెంతయు వెలింగె. 10

సీ. పథికనిశ్వాసదంభమున వేఁడిమిఁ జూపి
సవినయస్ఫూర్తి వేసవి భజింప,
గళదురుసుమరసచ్ఛలమున జడిఁ జూపి
వారక సేవింప వర్ష ఋతువు,
వ్యాకోచసుమకైతవమున సితాభ్రవై
భవముఁ జూపిఁ శరదృతువు గొలువఁగ,
చాటీరగిరిశీతపవనమిషమున శై
త్యము జూపి హేమంత మనుసరింప
శుకపికగళన్మరుద్ధూత శుభ్రపుష్ప
రజముపేర హిమానీఁదోరముగఁ జూపి
యవిరతంబుగ శిశిరర్తు వాశ్రయింప,
సకలఋతురాజమయిన వసంత మలరె. 11

సీ. సరసోరుకదళికా స్తంభంబులను మించి,
శుభకరపల్లవస్ఫురణ నెగడి,
వృక్షులకుచంబులఁ బెంపొంది చారుమఖ,
పకకలికాతనుప్రభలఁ దనరి,
యనుపమసుమమాలికాభిరామ్యముఁ దాల్చి,
రాచిల్క పల్కుల రహిఁ దనర్చి,
భ్రమరకసీలశోభామంజిమ వహించి,
పలుమల్లెమొగ్గలఁ బరిఢవిల్లి,
తిలకరుచిఁబొల్చి, మోవికాంతిని జెలంగి,
పాపటఁబొసంగి, యామోదభరము నించెఁ,
జూపఱకు నెల్ల వనలక్ష్మి సొంపెలర్ప
నభినవంబైన యా వసంతాగమమున. 12

వ. ఇట్లు త్రిలోకీమనోహరంబైన వసంతంబు ప్రవర్తిల్లిన నయ్యాదిమసార్వభౌముండు.

గీ. పటునవద్వాయద్వీపసంప్రాప్తిఁ గాంచి
విమలచంద్రమతీ కటిద్వీపవాంఛ
వెట్టె నపుడు త్రిశంకుభూ[illegible]
గలదె ఫలతృప్తి వసుమతీకాంత[illegible]

సీ. ఎలనాఁగపల్కుల కెన గావటంచునో
చెవిమొగ్గి వినఁడయ్యెఁ జిలుకపల్కు
లింతినెమ్మోముతో నీడుగాదంచునో
తళుకుటద్దముఁ జూడఁ దలఁపఁ డయ్యెఁ;
బూఁబోఁడిబాహులఁ బోలలే వంచునో
పూఁపుదండ లుమేనఁ బూనఁడయ్యెఁ;
బోలఁతి మైతావితోఁ బురుడుగా దంచునో
మొనసి శ్రీగంధంబు ముట్టఁడయ్యె;
బోటినిట్టూర్పుగాడ్పుతో సాటిగా ద
టంచునో యుశీరతాలవృంతానిలంబు;
సొంపునకు నించుకేనిఁ గాంక్షింపఁడయ్యె
మదనసాయకఖిన్నుఁడై మనుజవిభుఁడు. 14

గీ. తత్కథామృతసేవనతత్పరతను
నృపతిచిత్రవిలోకనానిమిషవృత్తిఁ
దెలివ యాహారనిద్రలు మఱచిపోయె
నితరభోగపరిత్యాగ మెన్న నేల? 15

గీ. మేను కృశియించె ధైర్యసమృద్ధితోడ,
కాలమును వింతతోడ దైర్ఘ్యము వహించె
గాలి వేఁడయ్యె నిట్టూర్పుగాడ్పుతోడ,
విరహసంతాపభరమున వెలఁది కపుడు. 16

క. అసుకొంచె నప్పు డా శ్రీ
యల్యాలి మధుకర నికరశుకపికావళికిన్, జా
బిలికిన్, జలిబిలివలికసు
వలికిన్, స్వాగింపుతు నెక్కున హాహాహాళికిన్. 17

గీ. చిత్తరువుప్రబొమ్మవలెనుండెఁ జెయుప్రఁదక్క,
పాండిమ వహించి శశిరేఖ భంగిఁ దోఁచె,
నలరుతీవియఁబోలె నతాస్య యగుచు,
శోభ యొసఁగదె వికృతియు సుందరులకు! 18

గీ. అతనుతాపంబు గావింత మనుచుఁ గోరి
సఖులు శైత్యోపచారము లతికిఁ జేయ
నైన నొండొకయర్థంబు దాగ్రహించి
యతనుతాపంబు గావించె నబ్జముఖికి. 19

గీ. ఒగి దినారాత్రములు తరణ్యుడుపయోగ
ములఁబడియునింతికి వియోగజలధి దాఁటఁ
గా నొకించుక శక్యంబు గాకపోయె
నతనుశరవృష్టినీరంధ్ర మగుచుఁ బర్వ. 20

గీ. ఎగిరిపడి కోయిలలు గన్ను లెఱ్ఱఁ జేసెఁ
బాష్పగోష్ఠికెను రాచిల్కపక్షులెల్ల
నప్పుకుఁడు దాశిఁజూపంగఁ దద్భటాళి
నరుణిమీఁదను దయఁజూడఁదలఁచు నెట్లు? 21

గీ. మలయపవమానపాణింధమప్రవర్ధ
మానపల్లవశిఖియుతోద్యానవిహృతి
కిని నోకింతయు మదినిఁ గాంక్షింపనయ్యెఁ
గొమ్మ యొప్పునె నవసితకోమలాంగి. 22

క. కిసలయమృదుతల్పపితృ
ప్రసూప్రభలు గానుపింపఁ బటుమోహతమం
బెసఁగ శ్రమబిందుతారా
విసర మడర సతికి రాత్రివిధమయ్యెఁ బగల్. 23

గీ. విరహపాండురతాజ్యోత్స్న విలసనంబు
నతనుతాపాతపస్ఫూర్తి యలముకొనఁగ
రేయి పగ లిది యని యేర్పరింపరామి
ముదిత నేత్రాంబుజము లరమోడ్పుఁగాంచె. 24

వ. ఇట్లు విరహదోదూయమానమానస యగు చంద్ర
మతింజూచి వయస్యలు తత్తాపోపశమనార్థంబు మదన
తుహినకిరణ మలయపవనాదుల నిట్లని స్తుతియించిరి.

క. పురుషోత్తమాత్మజుఁడ వై
వరసుమనోధర్మ మూని వర్తిల్లెదు సీ
కరవిందపత్రలోచనఁ
గరుణింపఁగ రాదె మదన! కరుణాసదనా! 25

వ. అని చంద్రు నుద్దేశించి,

మ. అమృతాంభోనిధిలక్ష్మితోడనుదయంబై రాజనంబొల్చితో
రముగా సత్పథవర్తినా నెగడి సర్వజ్ఞావతంసుండవై
కమనీయాఖిలసద్గుణంబులనుతుల్ గైకొన్న నిన్నెన్న శ
క్యమె? యీయుత్పలపత్రలోచనఁగృపంగాపాడు రాకాశశీ!

వ. అని మలయపవమాను నుద్దేశించి,

శా. శయ్యాదంభమున న్స్మరాంతకుఁడు భూషాకైతవస్ఫూర్తిచే
నయ్యార్యారమణుండు దాల్చిరి భుజంగాధీశుల న్నీయసా
హాయ్యప్రస్ఫుటధాటికోర్వకనుచో నబ్జాస్యలా మోర్చువా
రయ్యాగంధసమీరప్రోవగదవయ్యా యీకురంగేక్షణన్.

వ. అని ప్రశంసించి తదనాభిముఖ్యంబున కిట్లని యుపా
లంభించిరి.

గీ. కొమ్మల నదల్చు నెప్పుడుఁ గమ్మగాలి,
విధుతనయుఁడు మనోజుఁడు, మధుఁడు జాతి
వైరి, దోషాకరుం డుడువల్లభుండు
గలికి, వీరికి సుగుణంబు గలుగు టెట్లు? 28

వ. అని మనోభవు నుద్దేశించి,

క. వనముననె సంభవించియు
వన మేర్చు దవానలంబు వరుసయొఱఁగి కా
మనమున జనించి మన్మథ,
మనము గలంచంగ నీవు మదిఁ దలఁచితి వో. 29

క. పలుసాధనములు దాల్చక
నలసంగ్రామముల దాల్చినట్టి మత మహిమా
తెలియఁబడె మాకు సుమకో
మలగాత్రల సేచఁగాదె మనసిజ, నీకున్. 30

గీ. తోఁడఁబుట్టువునింటికిఁ గీడుఁదలఁచు
నట్టిదోషాకరుండ వీ వని శశాంక,
నిన్ను సుతుఁడని చూడక పిన్ననాఁడె
భవజటాటవివాటిపా ల్పఱిచెఁ గడలి. 31

గీ. విసముగంఠంబునను దాల్చి విసముకంటె
నతిభయంకరమూర్తి వీ వని శశాంక,
యుత్తమాంగంబునందు ని న్నుంచె హరుఁడు
వ్యక్తమే, శర్వసర్వజ్ఞవైభవంబు. 32

తే. చల్లగానున్న య ట్లుండి చంద్ర నీవు,
విరహిణీప్రాణనిహతిఁగావింతు వెపుడుఁ
జలువ మైనంటి కాదె రుజ గ్రహించు
భూతకోటుల ప్రాణముల్ వుచ్చికొనుట. 33

క. కాకోదరములవలెనే
లోకభయదుఁడ వని మనసులోఁ దలఁచి విభూ
షాకలనను సర్వజ్ఞుఁడు
గైకొనెఁ బాముఁ గుఱుచి సహజకౌటిల్య! నినున్. 34

క. కుండలితఫణివి యటుగా
కుండినఁ బలుమాఱు రాహు వాఁడిసిన సప్రా
ణుండ వయి యుండ నేర్తువె
పాండుమరీచిమరుదశన, భర్గాభరణా? 35

చ. త్రిపురహరుండు లోకహతికృద్భయదామితకాలకూటము
న్నిపుణత మ్రింగి తత్సహజు నిన్ బ్రతిపాకముచేసి మ్రింగఁడే
యపుడుసుధామయూఖసమయంబునునాత్మనెఱింగినీవుగూ
ఢపదవిభూషణోన్నత జటావనవాటిని డాఁగకుండినన్.

మ. తొలుతన్నిష్ఫలకుష్ఠచందమునఁదోడ్తోనెంతయున్ఘోరకుం
డలితాహీంద్రముచాడ్పునన్సహజచండత్వంబునీరూప మే
యిలపైఁజెప్పకచెప్పెఁ బాంథతతికై యేతాదృశుంజంద్ర,ని
న్నలరంబ్రోవఘటించువేఁడదగునాయస్మాదృశుల్వ్రీడిడుల్.

క. పడఁతుకచన్ను లసుల్క్రొ
మ్ముడి చీఁకటిగుంపు వక్త్రము సరోరుహ మం
చిడుమం బెట్టకు శశధర,
యుడునఖరఁ జకోరనయన నుత్పలగంధిన్. 38

వ. అని మలయపవమాను నుద్దేశించి,

చ. శమనునిదిక్కునం బొడమి సర్పముఖంబుల బైలువెళ్లి ని
త్యమును బలాశసంగతులు దప్పకఁ ద్రిమ్మరు నట్టినాలిబూ

తము, పవమాన, నీకుఁ గలదా మఱిభూత దయార్ద్రబుద్ధి? యు
క్తమకద నీకుఁ గొమ్మల నదల్చుట; నీవఁటి ధూళిపాలుగాన్.

వ. అని విరహిణీధైర్యవిదళనచుంచువ్యాహారంబగు రాజ
కీరంబుంగని యిట్లని యుపాలంభించిరి:

గీ. పరభృతంబుగానఁ బరికించి యొకవేళఁ
గోకిలంబు సేయఁగూడుఁగాక;
కాంతనామధేయ మెంతయుఁ గైకొని
చిలుక, నీకు వెట్ట సేయఁ దగునె? 40

వ. అని,

గీ. పడఁతివిరహార్తి నెన్నియుపాయములను
శాంతిఁబొందింప నెచ్చెలు ల్చాలరైరి;
వనజముఖి నిమిషం బొక్కవత్సరముగఁ
గడుపుచున్నది వేదనాగౌరవమున. 41

వ. తదనంతరంబున నుశీనరధరావరాగ్రేసరుండు వయ
స్యాలవలనం జంద్రమతి చిత్తంబు హరిశ్చంద్రనృపాయ
త్తంబగుట యెఱింగి పరిణయచికీర్షాధీనమానసుండై తన
పురోధసుండగు దృఢవ్రతునింబిలిపించి యిట్లనియె:

గీ. చంద్రమతి చిత్త మా హరిశ్చంద్రనృపుని
యందు నెలకొల్పియున్న దా యతివ తెఱఁగు
నీ వయోధ్యకువెళ్లి యానృపతిమణికి
విన్నపముఁజేసి తోడ్తెమ్ము విప్రవర్య! 42

—: ధృష్టద్యుమ్నుండయోధ్యకు వచ్చుట :—

క. అన వల్లేయుని భూసుర
తనయుండు దనపేర నుడుసుధాకరజల గా
ల్పనుపను నొక్కముహూర్తం
బునఁ జనుచుం బూర్ణకుంభములు నెదు రెకుటన్. 43

క. కనిపించిన శుభశకునం
బని భూసురవరుఁడు గనిపయనింబులను
స్వనములు పురములు నదులును
జనపదములు గడచికాంచె సాకేతంబున్. 44

వ. ఇట్లు గనుంగొని యా రాజధాని యుపప్లుష్టగోపురప్రాగ్వ
శృంగారంబునకచ్చెరువందుచుఁ బణ్యవీథిం జనువాఁడు
వివిధవర్ణాంబర రత్నపరంపరలయు, నానావిధామ్లాన
సూనమాలికలయుఁ, గర్పూరకస్తూరికా హిమజలాది
సుగంధి ద్రవ్యంబులయు సద్యఃకషణ్ణత స్తక్షీరాది పానీ
యంబులయుఁ, గ్రాయకశక్త్యనుసారమూల్యగ్రాహిం౦ది
వక్రయ్యాత్వేతరత్వంబులకరుదందుచు నొక్కబ్రాహ్మ
ణగృహంబునవిడిసియనంతరంబు నిరంతరయాతాయాత
మూర్ధాభిషిక్త పరంపరా పరస్పరముకుట కషణ
చ్ఛురిత మణిగణశర్కరిలం బగు నృపసభాభవనద్వా
రంబునం గొంతదడవు నిలిచి తత్రాజ్యసామ్రాజ్య

వైభవంబునకు విస్మయాక్రాంతనిజస్వాంతుండై చావా
రికప్రయత్నంబున హరిశ్చంద్రు సమ్ముఖుం బగుటయుం.

సీ. నందనం తే విప్రవల్ల భాభిమసాధ్వ
భామ తుభ్యం సదాభద్రమస్తు
అత్రోపవిశ భవదాగమనం కుతో?
విజయాస్పదపురా ద్వివేకధుర్య
తవనామ కిం ద్విజోత్తమ? దృఢవ్రత ఇతి
ప్రాహు ర్మనీషిణః పార్థివేంద్ర
యుష్మదాగమనప్రయోజనం కిం విప్ర?
రహసి వక్ష్యే ధరారమణవర్య
యనుచు నన్యోన్యపరిభాష లాడి పిదప
సముఖమందున్న యాశ్రితజనుల నెల్ల
వేఱొకనెపంబుఁ గల్పించి వీడుకొల్పి
మంతనంబుండె వసుమతీకాంతుఁ డపుడు. 45

వ. అంతదృఢవ్రతుండు సమ్రాట్ఛిరోమణి కిట్లనియె.

సీ. దేవ యుశీనరక్ష్మావల్లభునకును
సుత దనరును జంద్రమతి యనంగ
నారాజముఖి చిత్రకారులవలన నీ
కమనీయరూపవిభ్రమముఁ గాంచి

సీయంద ఱందంబు నెలకొల్పి సిచ్ఛరా
నంగజా_ర్తినిఁ గుందు టరసి నృపతి
యాకన్యకామణి నీకునర్పింపంగఁ
దలపోసి నీసన్నిధానమునకు
నన్నుఁ బు_త్తెంచె విజ్ఞాపనంబుసేయఁ
జి_త్తగింపుము నేను వచ్చిన తెఱంగు
సరసశుభమూ_ర్తి వినిహాత సం[శ్రితా_ర్తి
సాధుకీ_ర్తి హరిశ్చంద్రచక్రవ_ర్తి. 46

వ. తదీయసౌందర్యాతిశయంబు చి_త్తగింపుము.

సీ. కాలిగోరునఁ బోలఁగాలేవు చుక్కలు
చుక్కవంటిదియన సూటిపడునె?
గమనరేఖకు నుద్ది గాఁజాల వంచలు
హంసవంటిదియన ననువుపడునె?
దంతమంజిమకు ముక్తాపరంపరలోడె
నాణిము_త్తెమువంటి దనఁగఁ దగునె?
శశిమోము నన పోలఁ జాలమి శశిరేఖ
వంటిదియని పల్క వాటపడునె?
కలికిపలుకులకే యోడెఁ జిలుకపిండు
చిలుకవంటిది యంచు వచింపఁదగునె?
కాన నతిలోక సౌందర్య గరిమగలుగు
తరుణి కెనయైనవస్తువు ధరణిఁ గలదె? 47

ఉ. ఆనగుముద్దుమోముఁగాఁగ, సాయికిఁగుత్తపు చన్నుదోయితోఁ
రానునుఁదళ్లుమేనిఁగాంతియు, లాఁతెలివాలికకన్నుదోయిచెం
ప్పానెఱికీలుగంటు నోఁ అపా, యసదున్నుఁగౌను చెల్వమా
హా, నుతియింపఁగావశమె మానుగజాననమోహనాకారమేఁకిన్?

క. లోకత్రయాభినంద్యను
బైకవమోహరూపగుణసమగ్రిమచేత
న్నీకుఁ దగు నానఘూమణి,
యాకన్యకు నీవ తగుదు వవనీశమణీ! 49

క. కులరూపగుణసమగ్రిను
గలజవ్వని గలుగు టరుదు గలిగినదాని
న్నలువకు వేమోముఁలుగల
చిలువకుఁదన్మహిమ వినుతిసేయం దరమే? 50

క. ఆపుంస్కోకిలవాణికి
నీపయిఁగలకూర్మిచేత నిద్రాహార
వ్యాపారము లుడిగెను వసు
ధాపాలక, చెప్పనే లితరభోగేచ్ఛల్? 51

క. తెలుపుడు చేయంగలనా
చెలియమనోవ్యథ; శుభస్యశీఘ్రమ్మను స
ప్పలు కాదరింపఁగావలెఁ;
బలుకులు వేయేల ధరణిపాలవతంసా! 52

వ. అనిన నౌశీనరీ సుందరాంగి పరిణయాంగీకరణభంగి పెనుచు మందహాసకందళ సుందరవదనారవిందుండై త్రిశంకునందనుండు మహర్షి శ్రేష్ఠుండగు వసిష్ఠుం బిలిపించి యిత్తెఱం గెఱింగించిన యోగ్య సంబంధం బెనసెనని సంతోషించె. రాజేంద్రుండును వివాహలగ్నం బొకండు నిశ్చయించునది యని యానతిచ్చిన నరుంధతీజాని దృఢవ్రతునిం బిలిపించి దంపతుల పేరం బంచాంగశుద్ధియు, సూర్యసంక్రమ సగ్రహ పాపషడ్వర్గభృగుషట్క దంపత్యష్టమ కుజాష్టమ కుజనవాంశ క్రూరఋక్ష చంద్ర షష్ఠాష్టమ వ్యయస్థితి ప్రభృతిదోషరహితంబగు నొక్క కల్యాణ లగ్నంబు సిద్ధాంతీకరించి లగ్నపత్రిక వ్రాయించి కర్పూరవీటికా సహితంబుగా దృఢవ్రతునకు సమర్పించె. సార్వభౌముండును సువర్ణాంబరాభరణంబుల దృఢవ్రతుని బహూకరించి వీడ్కొలుపుటయు,

శా. కైలాసాద్రిదరీవిహార, ఫణిరాడ్గ్రైవేయసంశోభితా,
నీలగ్రీవ, జగత్త్రియావనకళానిష్ణాత చంచద్భుజా,
నాళీకాసనవంద్య, భక్తహృదయానందానుసంధాయకా,
ప్రాలేయాద్రిసుతాపృథుస్తన పరీరంభప్రియంభావుకా!

క. త్రిపురభిదాచణభుజబల,
కపటకిరాత,యఘదమన గంగాభరణా,
తపనగ్లావనలేక్షణా,
కృపాళునిజహృదయసేన ధీశ్వరమిత్రా ! 54
స్వరధిపముఖదివిజవినుతచరణా,
సరసిరుహాసయనసఖగిరిశరణా,
స్మరదమన, పరమపవమలచరితా,
సరసవచన కవిజనజలజరవీ ! 55

గద్య :

ఇది శ్రీమదశేష మనీషి హృదయంగము మృదుపద
నీరంధ్ర శుద్ధాంధ్ర రామాయణ ఘటనావైదుషీ
ధురంధ రాడిదము బాలభాస్కర కవితనూభవ
సరస కవిత్వవైభవ సౌజన్యనిధాన సూర
యాభిధానప్రణీతం బయిన కవిజనరంజనం
బను మహా ప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.



# కవిజనరంజనము

——:o:——

## తృతీయాశ్వాసము

శ్రీకాళికామనోహర,
లోకత్రయరంజనైక లోలుపహృదయా,
యాకాశకేశ,వందిత
నాకేశా,రామచంద్రనగరనివేశా ! 1

వ. అవధరింపుము:

క. సంతసముఁజెంది భూసుతుఁ
డంత స్వీజయాస్పదమున కరిగి ధరిత్రీ
కాంతునిఁ బొడఁగాంచి శుభో
దంతము వినుచుటయు నతఁడు హర్షముఁ జెందెన్. 2

వ. అంతఁ జంద్రమతికిఁ దద్వృత్తాంతం బెఱింగించి;

క. అమితోత్సాహంబునఁ జం
ద్రమతీకల్యాణవార్త ప్రజ లెఱుఁగఁగ భూ
రమణుం డాస్థాననివే
శమునం బ్రస్థానభేరి సఱువంబుంచెన్. 3

వ. అప్పుడు ప్రధానులం బిలిపించి శీఘ్రమ్ముగా సేయించి వివాహ యోగ్యద్రవ్యంబులు సమకూర్చునది యని యానతిచ్చిన,

సీ. కస్తూరికస్నీటఁ గలయంపిఁ జల్లించి
ముగ్గులు ముత్తియంబుల నమర్చి,
బంగారు మగరాలపగడంపుగోడిగలఁ
గురువేళ్లఁబందిళ్లు కుదురుపఱిచి,
తీరుగా మరకత తోరణంబులు గట్టి
మేలు కట్లంతటఁ గీలుకొలిపి,
చంద్రకాంత వితర్ది సవరించి కల్యాణ
మంటపం బొక్కెడ మట్టుపఱిచి,
పొంకముగ నిట్లు నగరం బలంకరించి
పర్వతమునంతపొడవుగాఁ బరిణయోగ్య
వస్తువులు గూర్చి సామంతవర్గమెల్ల
బ్రభున కెఱిఁగింప సంతోషభరముఁ బూనె. 4

వ. అంత నక్కడ వసిష్ఠుండు మంత్రులం బిలిపించి హరి
శ్చంద్ర వివాహ మహోత్సవంబునకు నిఖిలదిగ్దేశవ
సుంధరాపతులం బిలువనంపుఁడని నియోగించిన,

చ. సకల నృపాలకోటికి వెసన్ శుభలేఖలు వ్రాసిపంప భ
ద్రకరితురంగమాభరణ రత్నపరంపరలెల్లఁ గొంచుఁ బా
యక తమఁజుట్టుముట్టిచతురంగబలంబులుకొల్చి రానయో
ధ్యకుఁ జనుదెంచిరప్డు చతురర్ణవమధ్యమహీతలాధిపుల్.

వ. అప్పుడు హరిశ్చంద్రుండు:

సీ. సముచితముఁగ శీస్నానపుణ్యాహవా
చనముఖ్య కృత్యముల్ చతురవృత్తిఁ
దీర్చి, భక్తి వసుంధరీవసిష్ఠులకును
నభినతి చేసి, తదభ్యనుజ్ఞఁ
గమనీయమణికిరీటము మౌళిఁ దాల్చి,
కలికికట్టాణిచౌకట్లు వెట్టి,
వలిపెబంగరుసాలు వలెవాటుగా వైచి,
కేయూరహారముల్ గీలుకొలిపి,
వ్రేళ్ల మహనీయ రత్నముద్రికలు దాల్చి,
పచ్చలకడెంబులును సరపణులుపూని,
భద్రదంతావళంబెక్కి ప్రభువరుండు
నుదయగిరిఁ దోఁచుఁ భానునట్లుల్లసిల్లె. 6

సీ. ఘోషించెఁ బౌలుత దిక్కూలంకషోత్తుంగ
భేరికాభయదభాంకారరవము,
లంతట దిక్తటంబు లమొను నిర్వక్ర
రథచక్రనేమిఘుర్ఘురరవంబు,
ప్రబలె నానేక నిర్జాశ్వగర్జారవో
దార మత్తేభఘీంకారరవము,
లానేక నత్యుగ్రమగుచు రోదసి నిండెఁ
జటులగంధర్వహేషారవములు,

భూసురాశీరవంబులు పొలుపుమీఱె,
బహుళమర్దళకాహళా ర్భటులు చెలఁగె,
వేత్రధరహుంకృతులు వందినుతు లడరె,
నవనివల్లభుకల్యాణయాత్రవేళ. 7

—: హరిశ్చంద్రుని వివాహయాత్ర :—

సీ. శ్వేతాతపత్రాళి చీఁకట్లు వొలఁగించె
రాజన్యభూషణ రత్నరుచులు,
తురగఖురోద్ధూతధూళి పెంపడఁగించెఁ
గరిపుష్కరోత్థితకంకణములు,
సింధురమదవృష్టి సింధుల నింకించె
సామంతమకుటకర్షణరజంబు,
సైన్యసమ్మర్దసంజనితోష్మఁ దొలఁగించె
నమితపతాకాంబరానిలంబు,

సైన్యజనితావరోధంబు సైన్యముననె
తొలఁగెనని సైనికాళి సంతోషమందఁ
జనియె సైన్యంబు కతిపయదినములకును
రమ్యవిజయాస్పదపురీవరంబుఁ జేర. 8

వ. అంత,

మ. అతులోత్సాహముతో నుశీనరధరాధ్యక్షుండు దానాప్తసం
తతితో బాంధవులతోఁ బురోహితులతో నానానృపశ్రేణితో
జతురంగంబులతో నెదుర్కొని హరిశ్చంద్రాధిపుం దోడితె
చ్చి తగం గాంచనసౌధపాళి విడియించెన్ సుప్రదీపింపఁగన్.

చ. మరకతతోరణంబుల సమంచితకాంచనరత్నవేదులన్
సురుచిరకాయమానముల శోభితపట్టవితానపంక్తులం
బరిమళవస్తుజాలముల భాసిలుబల్విడిదిండ్ల చూపినం
బరిణయకౌతుకాగత నృపాలకకోటి వసించె నందులన్. 10

క. ఎక్కడఁ జూచినఁ గాల్బల,
మెక్కడఁ జూచినఁ రథంబు లిభతురగచయం,
బెక్కడఁ జూచినఁ దానై
క్రిక్కిఱిసెం బైటనాల్గుకెలఁకుల సేనల్. 11

క. నరవరశిరోమణి యుశీ
నరునిసభామంటపంబు సంద్రమతి
పరిణయకర్మజపములు
పరగ బ్రస్థానభేరిభాంకరణంబుల్. 12

సీ. అంతట నుశీనరుఁడు మఱికొంతవడికి
మంత్రులను బిల్చి కల్యాణమందిరమున
నధిపుఁ దోడ్తెచ్చునది యని యానతీయ
వేడ్కరాజేంద్రునకు విన్నవించుటయును. 13

సీ. రాజన్యకోటీర రత్నమకుటములు
కరదీపికాప్రభల్ గలసి మెలఁగఁ,
నాభీలపటుభేరికాభూరిభాంకృతుల్
మత్తేభఘీంకృతుల్ మైత్రిసలుప,
నుర్వీసురప్రజాశీర్వాదనాదముల్
విమలవందిస్తుతుల్ వియ్యమంద,
వారాంగనాదత్తనీరాజనాంశువుల్
హైమవేత్రిద్యుతుల్ లల్లుకొనఁగ,
భద్రకరిసెక్కి రూపవైభవసమృద్ధి
దన్పినవ్యగ్ర పౌరసంతతికి నేత్ర
పర్వమొనరించుచును సార్వభౌముఁ డపుడు
భూతలాధిపుశుద్ధాంతమునకు వచ్చె. 14

క. మూకలయి జవ్వనులు త
న్నాకాంతును జూచి హస్తిపాంకుశకృతసం
జ్ఞాకుంచితాంఘ్రికరి డిగి
భూకాంతుఁడు కొదమసింగము గిరిం బోలెన్. 15

వ. ఇట్లు భద్రదంతావళంబు డిగ్గి సముచితపరివారబంధునృపపురోహితసహితుండై కక్ష్యాంతరంబులు గడచి, యెడనెడ సువాసినీదత్తనీరాజనోపచారంబు లంగీకరించుచుఁ గర్పూరదీపికాగంధఫలంబును, ఘనసార

చూర్ణవిరచితరంగవల్లికా విరాజమానంబును మరకతతోరణాలంకృతంబును, బరిణతఫల రంభాస్తంభ శాతకుంభ పూర్ణకుంభాభి శోభితంబును, జాతపల్లవ సలిలలాజాక్షత భాసమానంబును, బరిణయోచితవస్తు పరంపరానయనవ్యగ్ర పురోహిత వ్యాకులంబును, సువర్ణమయ వేదికాద్వితయాలం క్రియమాణంబును, నగు కల్యాణమంటపంబుఁ బ్రవేశించి యుశీనరమహీజానికి నమస్కరించి తదీయ హస్తనిర్దిష్ట సమున్నతాష్టాపద పీఠికాధ్యాసీనుం డయ్యె నయ్యవసరంబున ;

క. మునివరుఁడైన వసిష్ఠుఁడు
జనపతి వీక్షించి లగ్నసమయము గాన
చ్చెను బెండ్లికూఁతుఁ దోడ్తేఁ
బనుపు విలంబనము సేయఁ బనిలే దింకన్. 16

క. అని యానతీయ వల్లే
యనుచు నుశీనరధరావరాగ్రణి ప్రమదం
బును జెంది యచ్చటిసువా
సినులకుఁ దోడ్తెండటంచు సెలవిచ్చుటయున్. 17

వ. అంత నంతఃపురంబునకుం జని చంద్రమతిం దోడ్తెచ్చి, సువర్ణపీఠికం గూర్చుండఁబెట్టి,

చ. జిలుఁగుపయంటదూలనునుఁ జెక్కులలే చెమటంకురింపఁగు
బ్బలునటియింపఁ దాళగతి బంగరుగాజులు మ్రోయ హారము
ల్మెలిగొన నూర్పు లుప్పతిల లేనడు మల్లలనాడ మెల్లనే
యలికులవేణి యొత్తుశిరసంటెను గొంజిగురాకుబోఁడికిన్.

క. తలదువ్వె నొక్క జవ్వని,
నలుఁగిడె నెమ్మేన నొకవనజముఖి, గంధా
మలకంబు వెట్టె నొకసతి,
జలకం బార్చె నొక లేమ చంద్రాననకున్. 19

చ. కలపము మైనలంది, యలికంబునఁ గస్తురిబొట్టు వెట్టి, వే
నలి విరిదండఁ జుట్టి, నయనంబులఁ గజ్జలరేఖఁ దీర్చి, చెక్కు
లమకరీకలాపము లమర్చి, సుమమాల్య విభూషణాంబరం
బులు గయిసేసి రాసతికిఁ బ్రౌఢతనంబులు మీఱ జవ్వనుల్.

క. రమణీజనము లొనర్చిన
యమలిన కల్యాణసముచితాలంక్రియ చం
ద్రమతీముఖహిమకరబిం
బమునకుఁ గాత్రికివలెం బ్రబలరుచి నొసఁగెన్. 21

గీ. చికిలిచేసిన మరుచేతిచిక్కటారి
యనఁగ సముచిత శృంగార మలవరించి
పెండ్లికూఁతును గావించి పేరఁటాండ్రు
వెలఁదిఁదెచ్చిరి కల్యాణవేదికడకు. 22

వ. ఇట్లు తో డ్తెచ్చినఁ దెరయెత్తి రనంతరంబ యుశీనరుం డాదిమసార్వభౌమునకు యథావిధి మధుపర్కాది మంగళార్హణవిధానంబు లొసంగి,

—: చంద్రమతీ హరిశ్చంద్రుల వివాహము :—

క. సుమతి యుశీనరుఁ డప్పు
ద్మముఖిం దన కూర్మిసుత 'నిమాం కన్యాం తు
భ్య మహం సంప్రదదే' యని
ప్రమదంబున ధారవోసె రాజేంద్రునకున్. 23

గీ. భూజనాసేచనకరూపములఁ దనర్చు
దంపతులమధ్యమునఁ దెర వెంపుమీఱె
రోహిణీ పూర్ణశర్వరీంద్రులనడుమను
గదిసియున్న శరన్మేఘఖండ మనఁగ. 24

క. అంత మఱికొంతవడికిం
గాంతలు తెరవంపఁ గుసుమ కార్ముకశృంగం
బెంతయువంచెను గంతుం,
డింతి త్రపావాప్తి మోము వొకించుక వంచెన్. 25

గీ. తగవుబలిమిని గొంకొకింతయును లేక
తనదుమదిఁ బట్టజాలని తనివి దీఱఁ
బూర్ణచంద్రుని నిరసించు పూవుబోఁడి
యాననాబ్జంబు వీక్షించె నవనివిభుఁడు. 26

గీ. నానసైఁ గొంకు గదిరెనునాళీపీక్షు
ణంబు లనియెడి యుంవిరినల్లగల్వ
తూపులను విభుధైర్యంబుఁ దూలనేసి
యలరుఁగైదువజోదు బిట్టార్చె నపుడు. 27

గీ. ఇంతిసౌందర్యరేఖాదిదృష్టిచేత
నెపుడు తెర వంతురను, వంచినపుడు గోరు
నిమిషపరికల్పితాంత రాయము విదిర్చ;
భూమిపతులందు వాంఛాప్రపూర్తిగలదె? 28

వ. తదనంతరంబ;

చ. అలఁతికవు న్వడంక వలయధ్వనినిర్మల బాహుమూలకాం
తులు గొనియాడలేనగవుతొంగలి రెప్పలడాఁగ హారము
ల్మెలిగొనజిల్గుపయ్యెదచలింపఁ గుచద్వయిరాయిడింబడం
జెలిదలఁబ్రాలువోసె నృపశేఖరునాదలపైనిదోయిటన్.

మ. అలమన్ మైఁబులకాంకురాళి దరహాసాంకూరముల్క్రన్నవం
దోలకన్నృత్యపుటొంట్లుగాడయుగళిందూఁగంగనత్కంకణం
బులుమ్రోయన్భుజమధ్యసీమరతనంపుందాళితార్మాఱుగాఁ
దలఁబ్రాలోసెలతాంగిమూదలపయిన్ ధాత్రీశుఁడత్యా
దృతిన్.

క. తలఁపునఁ జేర్కొనుకోర్కుల
చెలువున నొకచేతి కొక్కచే యిచ్చునఁగాఁ
జెలిపైఁబతి పతిపైఁజెలి
తలఁబ్రాలోసిరి మనోరథము లీడేఱన్. 31

క. మంగళతూర్యంబులు పు
ణ్యాంగనలశుభార్థగీతికారావము లు
ప్పొంగంగ హరిశ్చంద్రుఁడు
మంగళసూత్రంబు చంద్రమతికిం గట్టెన్. 32

క. కువలయదళాక్షిహస్తము
కువలయపతి కేలఁ గీలుకొలిపె నొకసరో
జవిలోచన యిరుగేలను
నవపులకస్వేదజలకణంబులు గదురన్. 33

వ. అనంతరంబ యరుంధతీవసిష్ఠపురస్సరంబుగాఁ గల్యాణమందిరంబుం బ్రవేశించి యగ్నిప్రతిష్ఠాపనానంతరంబున,

క. అనఘు వసిష్ఠమహాముని
ఘనతరమంత్రావసాన ఘటితస్వాహా
నినదానుసరణిఁ దనిపిరి
యనలుని దంపతులు నవగవాజ్యాహుతులన్. 34

క. వనితామణిపాదాబ్జము
తనహస్తాబ్జములఁబట్టి దరహాసరుచుల్
కనుఱెప్పలలోఁ డాఁచుచు
సనికల్ద్రొక్కించె రాజు జవ్వనిచేతన్. 35

క. చనుదోయి బాహులాడం
గను, దాటంకములు దూలఁ, గొనసియాడం

గ, నగల్ చలింప, లాజలు
వనజానన దోయిలించి వహ్ని న్వ్రేల్చెన్. 36

ఉ. భ్రాజదురోజసంపదకు బాహులతా భుజమూలదృగ్రుచుల్
తేజ మొసంగ; హారమణిదీప్తులు జిగ్గు పయంటగుంపుపై
రాజిలఁ, గానుదీగలహారంగులు చూడ్కికి విందుసేయ, నీ
రాజనమాచరించిరి చిరంటులు గొమ్మకు భూమిభర్తకున్.

సీ. కేలుమోడ్చిరి ప్రదక్షిణపూర్వకంబుగా
నాశుశుక్షణికి సత్యాదరమునఁ,
గాంచిరి గ్రహతారకామండలోపరి
స్థానసంవాసి నౌత్తానపాదిఁ,
బ్రణతిఁ గావించిరి భక్తి నరుంధతీ
సీమంతినికిని వసిష్ఠునకును,
జేసి రుత్సవమునఁ జేలాంచలగ్రంథి
సముచితపరిణయాచారనియతి,
ద్విజవరేణ్యులు బహుపురంధ్రీజనములు
ప్రీతి నాశీర్వదించి యర్పించుశోభ
నాక్షతలు గైకొని ధరించి రాదలలను
జంద్రమతియు హరిశ్చంద్రచక్రవర్తి. 38

వ. దినచతుష్టయానంతరంబున నుశీనరుండు దుహితృ
జామాతలం బయనంబు చేసి,

—: ఉశీనరుండు కానుక నొసఁగుట :—

క. మత్తద్విపసాహస్రం,
బుత్తమతురగాయుతంబు, సురుమణిభూషల్
పుత్తడియరదము లొక నూ
ఱత్తఱిఁ బ్రియమెసఁగ మామ యల్లున కొసఁగెన్. 39

సీ. గుజరాతి కెంపులు, గోమేధికంబులు,
దారవజ్రములు, ముక్తాఫలములు,
కాటుకమచ్చముల్ కస్తూరిపీనెలు,
కపురంపుఁగ్రోవులు, గందవొళ్లు,
కుంకుమపూవు, సంకుమదంబు, పన్నీరు,
తళుకుటద్దములు, రత్నపుబరిణెలు,
దంతపుదువ్వెనల్, తాంబూలపేటికల్
సవరముల్, మణిదండచామరములు
హారకేయూరకటకమంజీరముఖ్య
భూషణంబులు, పలువన్నె పుట్టములును
బ్రియముతో నిచ్చె గారాపుబిడ్డయైన
చంద్రమతికి నుశీనరక్ష్మావరుండు. 40

క. మఱియు నుశీనరనరపతి
తఱచగుమణిభూషలు దొడి తనపుత్రికకున్

మెఱపులువోని యొయారపు
తెఱవలఁ బెక్కండ్ర నిచ్చె దృఢసంప్రీతిన్. 41

వ. ఇట్లొసంగి యక్కాశుదాగ్రేసరుండు చంద్రమతిం
జూచి యిట్లనియె.

సీ. అనుఁగుబిడ్డలభంగి ననుజీవులను బ్రోవు,
మిలువేలుపులఁ గొల్వు మేమఱకల,
బతికిమ్ముం దనుభవింపకుమేపదార్థంబు,
జవదాఁటకుము నిజేశ్వరునిమాట,
మగఁడు గావించిన మన్నన కుబ్బకు,
మదిఁ గృశింపకు మవమానమునకు,
నవనిసురాభ్యాగతార్థికోటుల నెల్ల
నాప్తబంధువుల యట్లాదరింపు,
కరుణగల్గుము బంధువర్గముల కెల్ల
గురుజనంబుల సద్భక్తిఁ గొలువు మెపుడు
దైవమన్నను, గురువన్న, ధర్మమన్నఁ
బ్రాణనాథుండనుమ్ము మాయమ్మ కాన. 42

—: హరిశ్చంద్రుఁడు భార్యతో సాకేతంబుచేరుట :—

వ. అని వీడ్కొలిపి యయ్యుశీనరభూజాని శిబిరంబెత్తఁ
బడవాళ్లం బంచినం జతురంగబలసమేతుండై హరి
శ్చంద్ర సార్వభౌముండు కతిపయప్రయాణంబులకు

నాశీనరీవిలోకనవ్యగ్రపురంధ్రీవ్రాతంబగుసాకేతంబుఁ బ్రవేశించి పుణ్యాహవాచన పూర్వకంబుగా గృహప్రవేశమంగళాచారం బాచరించిన యనంతరంబ:

గీ. నిజకులాలంకరిష్ణులై నెగడినట్టి
దంపతులశోభ నాగమోత్సవముఁ జూచి
యింటి కేగెడుగతి వాసరేంద్రుఁ డపుడు
చరమభూధరసానుదేశమున కొలఁగె. 43

గీ. అంత కంతకు దీర్ఘంబు లగుచు జగతి
నిగుడునీడలతోడనే నిగుడసాగెఁ
జక్రవాకావళీమానసవ్యథలును
బాంధజనకామినీనేత్ర బాష్పములును. 44

క. కొలఁకులఁ దమ్ములతోడన
నెలఁతల నానావియోగినీసంఘాత
మ్ములకనుదమ్ములు మొగిడెను
జలజాప్తుఁడు చరమశైలసానువుఁ జేరన్. 45

క. జరఠారుణశోణకిరణ
పరంపరలు సాగె ధాత్రి పైని రథాంగో
త్కరముల మనములఁ జేరెడు
స్మరపావకశిఖ లనంగ సాంద్రం బగుచున్. 46

గీ. అరుణపరిణతఫల మపరాద్రినాఁట
దోనమొలసంజచివురాకుతో జనించె
రాత్రికుజము తచ్ఛాయనాఁ బ్రబలెఁ దమము
చుక్కలమరెఁ దదీయప్రసూనము లన. 47

క. తరణిరథనేమిచూర్ణిత
చరమగిరిమనశ్శిలారజము తద్వన సిం
ధురపుష్కరముల నెగసిన
కరణిని నెఱసంజరోచి గదిసెఁ బ్రతీచిన్. 48

గీ. నృత్యదళికాక్షవేగాసహిష్ణుమాళి
గాంగజలజోద్గతశిలీముఖవ్రజంబొ;
సాంధ్యరాగహసంతికసమయకాచ
కారకృతకాచచయమొ నాఁగఁ దమ మమరె. 49

సీ. ధ్వాంతదంతావళోత్కరపుష్కరోద్ధూత
గగనగంగాపయఃకణము లనఁగ,
శర్వతాండవ దిదృక్షాసమాగత ని
ర్జరీహారమౌక్తికశ్రేణు లనఁగ,
నభ్రకళిందజాహ్రదమున నిండార
విరిసిన తెలిగల్వవిరు లనఁగ,
భావినిశాచంద్ర పరిణయంబున కిడు
దిక్కుడ్యము లపిండి చుక్క లనఁగ,

గ్రిక్కిటిసె నుక్కమెుగి నెల్ల దిక్కులందు
క్షీరఘనసారపాటీరతారహార
హీరపారదనారద శారదాభ్ర
గౌరరుచి మీఱఁ దారకావార మపుడు. 50

గీ. తమమడరెఁ బాంథజనమోహతమముతోడ
వహ్ని వెలుఁగొందె మరుశౌర్యవహ్నితోడఁ
దారకలు దెల్విఁ గనె నభిసారికాప
రంపరలతోడ నెంతయుఁ బెంపుమీఱి. 51

గీ. నృత్యదీశాట్టహాస స్తనితము లమర
నభినవతమోభ్రములు జగ మాక్రమించి
విరహిణీబాష్పముల పేర వృష్టి గురిసి
జారిణీజారసస్యపుంజములఁ బెనిచె. 52

స్మరభూపాగమనప్రసారితసమచ్ఛచ్ఛామరాందోళన
స్ఫురణంబుల్, హరతాండవాసహఫణీఢ్ఫూత్కారముల్ కైరవి
ణ్యురుడోలాకలనల్వియోగిజనదీర్ఘోత్కృష్టనిశ్వాసముల్,
చరియించెన్ జనతాసుఖప్రదములై సాయంసమీరౌఘముల్.

సీ. యమునాపయఃపూర మనఁగ నిమ్నోన్నత
స్థలముల నెల్లెడ సమము పఱచి,
గంధాంధసింధుర ఘట యన నిశ్శంకఁ
బంకజాతమ్ములపొంక మడఁచి,

యసితాంబుదకదంబ మనఁగాఁదుకొంచును
విరహిణీబాష్పాంబు వృష్టి గురిసి,
యనుపమాంజనపుంజ మన నభిసారికా
జనము కన్నులఁ గప్పికొనఁదనర్చి,
స్వచ్ఛశిఖిపింఛ తాపింఛగుచ్ఛభాసు
రచ్ఛవిచ్ఛటఁ దెగడు నీరంధ్రవృత్తి
నఖిలదిక్కుహరంబుల నాక్రమించి
కానిపించెను గటికిచీఁకటులగుంపు. 54

శా. తారామండలఫేనఖండపటలీ ధారాళపాండుప్రభాం
కూరంబుల్పయిపై వెలుంగఁగ దిశాకూలంకషంబాచుఁ ద
ద్భూరిధ్వాంతకళిందజాపటు పయఃపూరంబుజృంభించి చ
ల్లారంజేసెను వ్రేల్మిడింబ్రబల సంధ్యాజాతవేదశ్శిఖన్.

సీ. దిద్దనికస్తూరితిలకంబు లాయెను
బాలేందునిభఫాలఫలకములకుఁ,
గూర్పనినీలిరంగులకంచుకము లయ్యె
నుత్తుంపు బిగి చన్నుగుబ్బలకును,
దాల్పనితాపింఛ తరుపల్లవము లయ్యెఁ
గొమరొప్పు నెఱిగప్పు కొప్పులకును,
గీలుకొల్పని హారనీలంపుసరు లయ్యెఁ
గంబుసన్నిభచారు కంధరలకుఁ,

జేయకయె చేయునట్టి కైసేత లయ్యె
నంధతమసపరంపర లనుచు బొంగి
యసమశర కేళులను నోలలాడె నపుడు
జారులను గూడి జారిణీసముదయంబు. 56

సీ. పతులయందును బోలె బహువిధాలంకర
 ణముల యందు ననాదరము వహించి,
నిందయందును బోలె నిబిడతమిస్ర వి
 హారంబులందు భయంబు దక్కి,
వరకులాచారసంవర్తనంబునుఁ బోలె
 మృదుతల్పసౌఖ్యంబుఁ బ్రిదిలఁ జేసి,
సముచితం బైన లజ్జాభరంబునుఁ బోలెఁ
 బ్రియసఖీసఖ్యంబుఁ బిల్కు మాన్చి
కుడ్యములు బొమ్మరిండ్లలాగునను దాఁటి
పాడుగోడలు కేళికాభవనములుగ
నసమశర కేళులను నోలలాడె నపుడు
జారులను గూడి జారిణీ సముదయంబు. 57

క. అమణిత, మబంధచాతురి,
యమూల్య, మనలంక్రియంబు, ననుగంధవిలే
ప, మతాంబూల, మపర్యం
కము నగు జారరత మపుడు గాటం బయ్యెన్. 58

క. అమరాధీశదిశాభా
గమునందలి తెల్ల యప్పు డగనపించె రజ
స్యమృతమయూఖమిథస్సం
గమసముచితహంసతూలికాతల్పమనన్. 59

గీ. అంబుజభవాండ మను హజారంబులోన
నలరు(గైదువపాదుషా యధివసింప
సమయభృత్యుఁడు పెట్టు కెంజాయపట్టు
బటువుబిల్లన( జంద్రబింబంబు దోఁచె. 60

క. అప్పుడు చంద్రుం డొప్పె
న్నిప్పులకుప్పవలె విరహిణీమండలికిం
జిప్పిల నమృతమునించిన
గొప్పపసిఁడికుండవలెఁ జకోరంబులకున్. 61

మ. యామవతీవధూటి బిగియారఁ గవుంగిటఁ జేర్చుటంద దం
గామలచందనంబుమయి నంటిన నందెలుపయ్యెబింబమా
కోమలగాత్రిగబ్బిచనుగుబ్బలకస్తురి బొమ్మ సోఁకెనో
నామహిఁద త్కళంకము గనబడెఁ గల్వలతేనికయ్యెడన్.

క. తిమిరాపహృతికిఁ గ్రోధర
సముపూనె సితాంశుఁ డుదయసమయంబునఁ ద
త్తమ మెడల సహజధవళిమ
నమరెఁ ద్విజరాజకోప మతిదీర్ఘంబే? 63

మ. కరమొప్పారు నిశానవోఢకు నిశాకాంతుండు మెల్మెల్లనే
కరము ల్సాఁచి తమోవినీలపట ముత్కంఠం దొలంగింప ని
ర్భరలజ్జం బతిమేనిపై ధవళవస్త్రంబు న్మొయిం గప్పుకో
న్కరణిం గ్రొందెలివెన్నెల ల్నిబిడమై కన్పట్టెనద్దిక్కులన్.

సీ. కుముదినీజృంభణాంకురమూలకందంబు,
తోయజశ్రీపశ్యతోహరుండు,
సకలజీవంజీవసంజీవనౌషధి,
చక్రవాకీ మనస్తాపకారి,
తిమిరవారణఘటాసమదమృగేంద్రంబు,
చిత్తజమాంద్యవిచ్ఛేదనుండు,
నఖిలదిదృక్షుజనాసేచనకమూర్తి,
బహులౌషధీప్రియంభావుకుండు,
సురలయాఁకటికూడు, ముచ్చులకుఁ గీడు,
చుక్కలకుఱేఁడు, వెలుఁగులయిక్కజోడు,
లచ్చిసైదోడు, రేబోఁటి వెచ్చకాఁడు,
చంద్రుఁ డలరారె సత్కళాసాంద్రుఁ డగుచు. 65

క. పొంగెఁ బయోనిధు, లిరులు దొ
లంగెను, జక్కవలగమి కలంగె, మనములం
ద్రుంగె వియోగులధృతులు, చె
లంగెఁ జకోరము, విధూపలంబులు గరఁగెన్. 66

సీ. భవ్యచకోరదంపతులకోరనికోర్కె,
వనజాతములకుఁ బెట్టనివిసంబు,
కాముకశ్రేణికిఁ గన్నులపండువు,
విరహిణీజనముల వేఱువిత్తు,
నభిసారికాసమూహము కాలిసంకిలి,
మ్రుచ్చుచేపవలకు విచ్చుమొగ్గ,
కైరవిణీసముత్కరము నోముఫలంబు,
కోకసంఘములకు గుండెదిగులు,
పండురేయెండ బ్రహ్మాండ భాండములను
నింపుకొనియుండె డిండీర పుండరీక
కుండలీశ్వరమండ లా ఖండ లేభ
ఖండనోద్దండపాండితి పాండురుచిని. 67

క. బలువెన్నెలవేఁడిమిఁ గొం
దల మందుచుఁ జెట్లుమఱువున వసింప వియో
గులు పఱచిన కంబళముల
పొలుపున దట్టముగఁ బొలిచె బుడమి న్నీడల్. 68

క. కలశాబ్ధిభంగి వెన్నెల
పొలిచెం దెలిదీవికీవి పూర్ణసుధాంశుం
డలరె నచట నున్న రమా
లలనాధిపుభంగిఁ దత్కళంకం బొప్పెన్. 69

క. వలిపెపుఁజలువవలువలై,
మలయజపంకంబులై, సముచిత ముక్తా
ఫలహారములై, యాశా
లలనలఁ గైసేసె వెన్నెలలు దట్టములై. 70

వ. అయ్యవసరంబున,

చ. కలపము, పున్గు,గందవొడి,కస్తురి పీణెలు, పచ్చకప్రపుం
బలుకులవీడెము,ల్కనకపంజరశారిక, లంచదూది పా
న్పులు,ఘనసారదీపికలు, పూవులపందిరి, తూఁగుటుయ్యెల
ల్గలరవము, ల్వితానములుగల్గిన కేళిగృహంబు లోపలన్.

క. దోమతెర పట్టెమంచము
పై మెత్తనియంచదూది పానుపున ధరి
త్రీమండలాధిపతి ని
స్సీమమనోహారిరంసచే నుండుటయున్. 72

గీ. చంద్రమతిని హరిశ్చంద్రసార్వభౌము
నంకపీఠికయందు నలంకరింప
నిండువేడ్కలతోడుత నెమ్మనములఁ
బ్రౌఢసతు లూనసేయ సైరంధ్రు లపుడు. 73

క. కలపం బలంది, మృగమద
తిలకం బిడి,కజ్జలంబు దీరిచి,పూదం

డ లలంకరించి, రవణం
బులు దొడికైసేసి రిట్లు పూవుంబోఁడిన్. 74

వ. ఇట్లలంకరించి సముంచిత మంజరీభరవినమ్ర మల్లికా వల్లికం బోలె లజ్జాభరంబున నానతాస్య యగు చంద్రమతింజూచి నెచ్చెలు లిట్లనిరి:

గీ. పతులసన్నిధి కేగెడు పద్మముఖులు
పడఁతి యీచందమున లజ్జపడుదు రటవె
కలితవాంఛాసరిన్నిదాఘుంబు సూవె
ప్రబలమందాక్షుభర మది పరిహరింపు. 75

క. చేరంబిలిచినఁబొమ్మీ,
గారవముననంకపీఠిఁ గైకొనుమీ, స్వే
చ్ఛారతుల కియ్యకొనుమీ,
యూరక యుండెదు సుమీ పయోరుహనయనా! 76

క. ప్రేమ విడె మొసఁగఁ గైకొను
మీ,మగనిని గౌఁగలింత కెడవెట్టకుమీ,
మో మెత్తి ముద్దొసంగుమి,
మోముద్దులగుమ్మ! యూరకుండెదుసుమ్మీ! 77

వ. అని యివ్విధంబున,

గీ. సఖులు ప్రార్థించుతఱిని లజ్జాస్రవంతి
పద్మగంధికి మోకాలిబంటి యయ్యెఁ

బడకయిలు సేరుతటి మొలబంటియయ్యెఁ
బళిని డాయంగఁ బుక్కిలి బంటి యయ్యె. 78

గీ. సఖులు,ముందరి దెసకు లజ్జావధూటి
వెనుకదెసకును, ద్రోయ నవ్వేళయందుఁ
గలికి నవరత్నమయడోలికయును బోలి
భూతలాధిపుచిత్త ముయ్యాఁల లూఁచె. 79

వ. ఇట్లు ప్రసభాచరణంబున దలిమంబుఁ జేర్చి;

క. అక్కాంతామణి నెచ్చెలు
లొక్కొకపని పేరు చెప్పి యూడనిబాడన్
మిక్కిలి మన్ననఁ బెనుచుట
నక్కలికిని ద్రప వయస్యయై భజియించెన్. 80

సీ. ఆస్యేందురుచిని శశాంకాశ్మకుడ్యముల్
కరఁగునంచునొ నెమ్మొగంబు వంచె,
మహితలజ్జాసరిన్మగ్న యగుట నేమొ
వరునిమాటకు మాఱు వలుక దయ్యె,
భావిసఖకృతభయము గీల్కొనుటనో
కలకంఠి నెమ్మేనఁ గంప మందెఁ,
గ్రొవ్వాఁడిచూపుముల్కుల కోర్వఁడంచునో
సుందరి పతిఁ దేఱి చూడ దయ్యె,
భూవరవసంతసంపర్కమున లతాంగి
యంగలత కోరకితమయ్యె ననఁగఁ జూడఁ

బటుతరస్వేదకణములు పర్వె మేన
సారసాయతనేత్ర కాసమయమందు. 81

క. పిలిచినచో మాటాడమి
తలయెత్తమి తేఱిచూడఁ దలపోయమి ముం
గలనయ్యెడు జలజానన
పొలయలుకలపొలుపుఁ దెలిపె భూపతిమదికిన్. 82

గీ. తల్పమునఁ బ్రాణనాథుఁడు తరుణి యాన
తాస్య మెగనెత్తి కౌఁగిట నలమికొనఁగఁ
బ్రమద గొనయంబు డించిన పంచబాణు
పుష్పకోదండమో యనఁ బొలిచె నపుడు. 83

ఉ. పయ్యెదఁబాపుడున్నదతి పాణిసరోజములం గుచద్వయం
బొయ్యనమాటఁబోక ముడియూడిచిచక్కిలిగింతగొల్పి రా
జయ్యెడఁజన్నుదోయి తనకగ్గము చేసెను గ్రమ్మఱక్షభశా
యెయ్యదిగాదులోకువమహీస్థలిసమ్య గుపాయశాలికిన్.
తమిఁజన్గప్పు దొలంగఁజేసినఁ గుచద్వంద్వంబుహస్తారవిం
దములన్మాటుడుసీవిఁబాపమఱి యత్నంబేమియుందోఁచకా
ప్రమదారత్నమునాథుకౌఁగిట ఘటింపన్మేల్పాయంగ్రాహసా
ఖ్యముగల్పించెనహోఘలజ్జయనుచుం గాంతుండుపొంగెన్మదిన్.

గీ. కోపనాహ్రీంభరంబుచే నొప్పువడియు
మనుజపతి రాగలత యూఁత గొనుచునిలిచెఁ

ప్రసవశరుఁ డెంత చెనగుఁ? కాల్పట్టి తన్నఁ
జూరుపట్టి వ్రేలాడఁగఁ జొచ్చె నపుడు. 86

గీ. సరసవృత్తి ముహుర్ముహుఃక్షుతకదుష్ట
చంద్రవదనాధరేక్షురసంబుఁ గ్రోలె
గల్లచుంబన ముపదంశకంబు గాఁగ
రసికశేఖరుఁ డాధరారమణవరుఁడు. 87

క. ప్రసభగ్రాహ్య స్త్రీకుచ
మసుఖాప్తవధూపగూహ మధికశ్రమసా
ధ్యసతీజఘనమగు నవ
ప్రసవాయుధకేళి యయ్యె రాజేంద్రునకున్. 88

క. వేడుక యొసంగె విభునకుఁ
జేడియ సేఁతకును బదులు సేయని చెయువున్
వ్రీడని వ్రీడాభరమును
జూపని చూడ్కియును బ్రథమసురతక్రీడన్. 89

గీ. నిండుతమిఁ జంద్రమతియందు నిద్రయందు
లీల దక్షిణభావంబు గీలుకొలిపి
రాత్రి గోల్పుచ్చె నొకముహూర్తంబుఁబోలె
సాధుకీర్తి హరిశ్చంద్రచక్రవర్తి. 90

గీ. అసమశరతంత్రవేదపాఠావసాన
సముచితోంకారమంత్రరాజంబు లొక్క

యనఁగఁ జెలువొందెఁ దామ్రచూడారవమ్ము
లఖిలదిక్కులయందుఁ దదవసరమున. 91

గీ. మోర యల్లార్చినందున ముందరిదెసఁ
దూలి పడినట్టి రవిరథతురగవదన
ఫేనఖండంబ నంగను గాన నయ్యె
విమలతరకాంతి పెంపెక్క వేగుఁజుక్క. 92

క. రేనెలఁత యపుడు ముదుసలి
యైనకతంబునను దట్టమై కనుపట్టం
బూనినపలితద్యుతి యనఁ
గా నాలుగుదెసలు ధవళకాంతిఁ దనర్చెన్. 93

క. నిరుపమతమమదనోత్సవ
హారణకళా కేతుతారకాధిపభరహం
దురవిగ్రహాము లో యన మం
దిరదీపాంకూరపటలి తెల్లం బాఱెన్. 94

గీ. లలితదీపాంకురాళికిఁ బలితముద్ర
కువలయశ్రేణులకును జోకొట్టుపాట
కంజపుంజంబులకును మేల్కొలుపుమరుని
యూఁటటప్రభాత మెంతయునొప్పు నెఱపె. 95

క. సితకిరణుం డపు డొప్పం
బ్రబీచినిఁ బ్రభాతసమయపవమానసము

ద్గతచరమశైలవనప
గ్ధతరుచ్ఛద మనఁగ నుజ్ఝితద్యుతి యగుచుఁ. 96

గీ. రాజపరభూభృదాప్తి నిస్తేజుఁ డగుచు
నపరవారాశిలోపల నస్తమింప
స్ఫుటతరంబుగఁ గువలయంబునకు నపుడు
మిత్రుఁడే శత్రుఁ డగుట విచిత్రమగునె. 97

క. పులుఁగులరొదలు చెలంగెం
బలుచీఁకటి బూచిపిండు పాఱఁదగులఁగా
నిల సమయమాంత్రికుఁడు దా
వలనొప్పఁ బఠించు మంత్రవర్ణంబు లనన్. 98

గీ. తరుణతపనాంశుశిఖిశిఖాతతులు పేర్చి
ఘనతరతమస్తమాలకాననము నేర్చఁ
బ్రభవమందిన చిటచిటార్భటి యనంగ
విహగరావంబు దిక్కుల విస్తరించె. 99

క. అరుణోదయంబు దోఁచిన
నిరులు మహాహార్యగుహల కేఁగె దవశిఖన్
భక్షించి భల్లుకసము
త్కరములు దూఱఁగ నికుంజతతి డాఁగఁగన్. 100

గీ. ప్రాగ్దిశాయజ్వపత్ని ప్రభాతమనను
జంద్రికాస్వచ్ఛజలధారఁ జలకమాడి

కట్టుకొన్నట్టి కెంబట్టుపుట్ట మనఁగఁ
బూర్వసంధ్యారుణిమ చూడఁ బొలిచె నపుడు. 101

గీ. అరుణకిరణంబు లుదయాద్రి నలముకొనఁగ
సార్థకతఁ గాంచె దివి నభం బనుసమాఖ్య
వసుమతీనామ మల్ల యుర్వరకు నమరెఁ
జంద్రభానూదయం బైనసమయమునను. 102

కలువలసూఁడు తమ్మిచెలికాఁడు నిశావిభుజంట చుట్టుపు
ల్గులగమినోముపంట ఖగఘోటునకున్వలచూపుమూఁడు మూ
ర్తులునొకమైనరూపు తొగరుం జిగిరంగువెలుంగుప్రోవు ప్రాఁ
బలుకులతావు పూర్వగిరిపై నపు డొప్పె దినేంద్రుఁడెంతయున్.

గీ. దినదినంబున కొకవింత దిట్టతనము
దినదినంబున కొకవింత తెలుఁగుచెయువు
దినదినంబున కొకవింత తివుట గలిగి
జరిగె నాదంపతుల మిథస్సంగమంబు. 104

కాంతారత్నసమాగమంబును నెదన్గాత్ర్కించు నే తెంచుడుం
జెంతం జేరఁగఁగోరుఁ జేరుడుఁ గుచాశ్లేషాప్తిఁ గాంక్షించుఁ గా
నంతం దత్కళ లంటఁగోరు ఫలతృప్తాత్మత్వ మూర్ధ్వవధూ
కాంతానఖ్యాకుటుంబుఁబల్కు స్మృతివాక్యస్ఫూర్తిసార్థంబుగన్.

సీ. జాఱిననెఱికొప్పు సవరించు నెపమున
బాహుమూలచ్ఛవుల్ బయలుపఱిచి
ప్రిదిలిన నీవిక బిగియించుమిషమున
గబ్బిగుబ్బ లురమ్ము గదియఁ గ్రుమ్మి
చెదరుపయ్యెదఁ జక్కఁజేర్చుదంభంబున
నూరులపై నూరుయుగళిఁ బెనఁచి
డిగఁజాఱు ముంగురు లెగదువ్వు కైతవం
బున నెమ్మొగంబుపై మోముఁ జేర్చి
యంతకంతకు వెగ్గలం బగుచుఁ దనదు
భావమునఁ దోఁచుతమి బయల్పడక యుండ
విభుని డెందంబునకుఁ గొల్పె వింతచవులు
కువలయదళాక్షి మఱియొకకొన్ని నాళ్ళు. 106

సీ. పదిపిల్పులకును దాఁ బలుకఁ గొంకెడుకాంత
పలుమాఱు వింతగాఁ బలుకనేర్చెఁ
జేయిసాఁచిన నోరసిలు పయోజానన
కులుకుగుబ్బల బొమ్మ గుమ్మనేర్చెఁ
బ్రార్థింప మొగమెత్తి పాఱఁజూడని చాన
చుఱుకువాల్చూపుఁ జూడ నేర్చె
మోవి పంటను నొక్క మోముద్రిప్పెడు లేమ
తియ్యనిమోవి యందియ్యనేర్చె

రతికిఁ జాలుకగ మైకోని రాజవదన
ప్రబలపుంభావసంభోగపటిమఁ దేల్చె
నసమసాయకకేళిలో నను దినంబు
నంతకంతకుఁ గడిదేఱి యామిటారి. 107

సీ. నిశ్వాసనసురభిళానిలముల సంపద
సరసవసంత ర్తు సరణిఁ జేయ
నన్యోన్య నఖర రదాంకురక్షతజోష్మ
పటిమ గ్రీష్మర్తువైభవముఁ దెలుపఁ
గమనీయతరతనూ ఘర్మాంబు కణవృష్టి
గరిమ వర్షాగమ స్ఫురణఁ జేయ
విమల చిత్తాంభోజవికసనాతిశయంబు
మహనీయ శరదృతు మహిమఁ బెనుప
నొఱపు నెఱపు దృఢాలింగనోత్సుకతయు
నధరచుంబనసీత్కారణాను ర క్తి
శేషిత ర్తుద్వయస్ఫూర్తిఁ జేయ రతను
సకలఋతుసౌఖ్య మొసఁగె నాజంపతులకు. 108

క. లీలోద్యాన పరంపర
కేళీ కాసారములను గృతకాద్రిదరీ

పాలికలఁ గేళి సలుపుచు
బాలికయు స్విభుఁడు గని రపారసుఖంబుల్. 109

గీ. సత్యము దృఢవ్రతంబుగా సంగ్రహించి
రాజసూయాది వివిధాధ్వరము లొనర్చి
వరగుణోజ్జ్వల సంతానవంతుఁడై క
రిమును సుఖ ముండె నాధరారమణమాళి. 110

శా. మాయాభిల్లవపుష్క, మానిజనతామధ్యేహృదంభోరుహా
ధ్యేయాత్మీయపదారవింద హిమరుగ్ధిక్కారి కీర్తిప్రభా
నైయాఘ్రాజినచేల నర్తనకళానైయాత్య భక్తావళీ
శ్రేయోదాయిశుభేక్షణా శ్రుతివధూ సీమంత ముక్తాఫలా!

క. ప్రభ్రష్టకదభ్రాపగ
దభ్రేతర కీర్తిశోభిత జగత్త్రియర
శూ భ్రాజిష్ణు భుజార్గళ
శుభ్రాంశు కనత్కళాభిశోభి కపర్దీ! 112

చతుర్విధ కందగర్భిత ప్రమితాక్షర వృత్తము

హరమాని పుంగవమనోబ్జరవీ
పరమేష్ఠివంద్య పదపంకరుహా
కరిదానవాంతక జగద్భరణా[illegible]
నరకాంబువాహపవనా వరదా!

గద్య:

ఇది శ్రీమదశేషమహిమహానయంగమమృదు పద
సీరంధ్ర శుద్ధాంధ్ర రామాయణఘటనా వైదుషీ
దురంధ చాడిదము బాలభాసర్కకవితనూభవ
సరసక విత్వవైభవ సౌజన్యనిధాన సూర
యాభిధాన ప్రణీతంబైన కవిజనరంజనం
బను మహాప్రబంధంబునందు సర్వం
బును దృతీయాశ్వాసము.

సంపూర్ణము.